# వయోజన విద్య

మొదటి పుస్తకము





గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

## వందే మాతరం

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం ॥వందే॥
శుభ్రజ్యోత్స్న పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥వందే॥

### చదువుకోండోయ్! చదువుకోండోయ్!!

చదువురాని పెద్దలంతా
చదువుకొందురు – గాని రండోయ్
చదువుకొందురు – గాని రండోయ్ ॥చదు॥
చదువు సులభము – వ్రాత సులభము
చాల సులభము – తెలుగు చదువు ॥చదు॥
సులువు పద్ధతి – సులభమార్గము
తల్లిబాసను – నేర్వ రండోయ్
తప్పకుండా నేర్వ రండోయ్ ॥చదు॥
అక్షరంబే – సూర్యుడండోయ్
మీదె రాజ్యం – అయిన దండోయ్
చదువుకుంటే – బాగుపడునోయ్
చదువుకోండోయ్ – చదువుకోండోయ్ ॥చదు॥

# వయోజన విద్య

## మొదటి పుస్తకము



గ్రంథకర్త
గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు
అఖిలభారత వయోజన విద్యాసంఘ ఉపాధ్యక్షులు
దక్షిణభారత వయోజన విద్యాసంఘ ఉపాధ్యక్షులు



ప్రకాశకులు
ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు
పటమట పోస్టు, కృష్ణా జిల్లా.

పదకొండవ కూర్పు
౧౯౫౬

సర్వోదయ ప్రెస్
పటమటలంక

చదివిన దిట్టలకు

అన్ని చదువులు గ్రంథాల నమరు కతన
గ్రంథమున కక్షరమె ప్రాణకందమగుట
నక్షరజ్ఞాన మందర కందజేయు
దీక్షబూనుడు చదివిన దిట్టలెల్లం



వెల
ఐదు అణాలు

# తొలిపలుకు

తెలిసినదానితో ఆరంభించి తెలియనిది క్రమక్రమంగా నేర్పుతూ పోమ్మని విద్య నేర్పడములో ప్రధాన సూత్రము. తెలిసినది అంటే వుపాధ్యాయునికి తెలిసినదికాదు. చదువునేర్చే మనిషికి తెలిసినది. ఆమనిషికి తెలిసిన శబ్దము, తెలిసినపదము, తెలిసినవాక్యము, తెలిసిన భావము, ఇట్టివి మొదటి సాధనాలుగా వుపయోగించుకొనవలెనన్న మాట. తెలుగు ప్రజాసామాన్యము నోటిలో ఆడే శబ్దాలు ఇవి అని నిర్ణయించడానికి కొంతపరిశ్రమ అవసరమయింది. దానిమీాదట యీ పుస్తకంలోనూ నా అక్షర పటంలోనూ అనుసరించిన అక్షర క్రమం అనుసరించడ మయినది. 'రామ' 'పాప' 'మామ' 'రా' అనే పదాలు తెలుగు నాటిలో సర్వజనులకూ పరిచయమయినవి. ఇవి మొదటి రెండు దినాలలోనే గుర్తుపట్టడానికి వీలు కల్పించడమయినది. 'రారా రామా,' 'రారా మామా' అని రాగ యుక్తంగా వాక్యం వుచ్చరించడానికిని రెండు దినాలలోనే సాధ్యంచేయడ మయినది. అచ్చు గుణింతాలన్నీ వొకే పర్యాయం వొక అక్షరానికి నేర్పడ మారంభిస్తే మారుతూ ఉండే గుణింతపు గుర్తులను చదువరి మనసులో నిలుపుకోవడం కష్టము. కాబట్టి కొన్ని అక్షరాలు నేర్చేవరకూ వొక గుణింతపు గుర్తే కనిపిస్తూ వుండేట్లు పాఠాలు తీరిస్తే అది గట్టిపడుతుంది. తరువాత క్రొత్త అక్షరాలు క్రొత్త గుర్తులు చేరుస్తూ పోవచ్చును. ఈ పుస్తకములో ఆ విధానమే అనుసరించినాను. ఏ విధానంలో చదువు చెప్పినా అక్షర స్వరూపమిది అని నేర్పక తప్పదు. ఆ స్వరూపాన్ని గుర్తింప జేయడానికి ఇది 'వ' దీనిని జ్ఞాపకముంచుకొమ్మని కట్టె విరిచినట్లు చెప్పడానికంటె 'వ' అనే అక్షరం మొదటవచ్చే బొమ్మ (వీలయితే రంగులలో కూడా) వేసి ఇది "పనసబొమ్మ కదా నాయనా" అని ఆరంభించి 'వ'ను ప్రత్యేక రంగులో వేసి చూపించి మెల్లగా బొమ్మను తప్పించి 'వ'ను గుర్తింప చేయడం రసవత్తర మార్గం. దీనికి నా అక్షరపటము సహాయపడుతుంది. లేదా బోధకుడే కొన్ని

అక్షరాలు చదువరి నేర్చేవరకూ అట్టి పటాలు తానే తయారుచేసుకొనవచ్చును. 'పనస' 'రంపము' 'మంచము' 'పాము' 'రాటము' 'మామిడి' ఈ బొమ్మలు పేళ్ళతో, మొదటి అక్షరం ఎర్రిరంగులో తీర్చి, తయారుచేసుకొంటే చాలును. వేరేగా కాగితపు ముక్కల మీద బొమ్మలేకుండా తాను నేర్చే అక్షరం ఎర్రిరంగులోనే వ్రాసి పెట్టి చదువరి చేతికిస్తే అభ్యాసానికి పనికివస్తుంది. అల్లే రెండేసి అక్షరాల పదాలు, మూడేసి అక్షరాల పదాలు కాగితపు ముక్కల మీద కొంతవరకు వ్రాసియిచ్చి అభ్యాస పరచవచ్చును. కాని అక్షరాలతోనే గుణింతాలతోనే పదాలతోనే పాఠ మయిందని తృప్తిపడరాదు. మొదటి అక్షరంతో చేరినపదం ఆరంభించినది మొదలు దానికి సంబంధించిన విషయాలు చెప్పడం వాక్యాలు కూర్చి చదివించడం పెద్దల చదువులో ప్రధానం. మొదటి 'పనస' పటమును ఆధారపరచి ఫలవృక్షములను గురించి కొద్దిగా సంభాషణ జరుపవచ్చును. అల్లే మొదటిపాఠంలోని 'మర' ను ఆధారం చేసి యంత్రాలను గురించి సంభాషింపవచ్చును. నా పుస్తకములోని రెండవ పాఠమునుంచే వాక్యరచన కనిపిస్తుంది. ఆ వాక్యాలను వాక్యాలుగా చదివించవలెను. అందులోని భావమును విశదపరచవలెను. అక్షరాలు విడదీయుటకు మాత్రం వుపయోగించరాదు. మొదటినుంచీకూడ కొన్ని సుందరమైన లలితమయిన పద్యాలు, పాటలు బోధకుడుపాడి, విద్యార్థులచేతను పలికిస్తూవుంటే అవి వారికి పట్టుబడును. ఈ పుస్తకములోని కడపటి వాక్యాలు చదివిన తరువాత ఈ పద్యాలు, పాటల నొక్కొక్కటిగా బోర్డుమీదో, కాగితముమీదో పెద్ద అక్షరాలతో వ్రాసి చదివిస్తే నోటికి వచ్చినవి కాబట్టి త్వరగా చదవడంసాగి వేగం అలవడుతుంది.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

# మొదటి భాగము

[ ఉపాధ్యాయుడు నేను వ్రాసిన 'వయోజనవిద్య - బోధన క్రమము' అనే పుస్తకమును, ఈ కూర్పుకు నేను వ్రాసియుండు తొలిపలుకును చదువుకొని బోధన ఆరంభించడం మేలు. ] ఈ క్రింది పాఠం మొదట నేర్పడం పని లేదు. వ్రాతనేర్పేటప్పుడు అక్షరాలు గుండ్రంగా వుండటానికి యీ సూచన.

○ పెద్దసున్న

○ చిన్నసున్న

◡ వెలికిలవేసిన అరసున్న

◠ బోర్లవేసిన అరసున్న

( కుడికి నిలిపిన అరసున్న

) ఎడమకు నిలిపిన అరసున్న

— అడ్డగీత

| నిలువుగీత

\/ వాలుగీతలు

గుండ్రటి రూపాలు

ఝ ఎ ఋ ౠ ε ౩ S

ల ౧ 8 ర మ

పాఠము ౧

ప ర మ

మర మర

ర మ

ప ర

మ ర

| | | |
|---|---|---|
| ప | మ | ర |

## పాఠము ౨

[హల్లు శబ్దముతో కురచ అకారముచేర్చి పలుకవలసివస్తే ఆ హల్లు నెత్తిన విలిచే గుర్తు ✓ ఇది. ఆ కారముచేర్చి పలుకవలసివస్తే గుర్తు ా ఇది. ✓ గుర్తు అతకకుండా అకారంతో పలికే హల్లులు తెలుగులో కొన్ని వున్నవి – ఖ, జ, ట, బ, ల, జ, ఞ, ణ. ఆకారం వలుకడానికి ా గుర్తు రెండు రకాలుగా అతుకుతుంది. తెలుగులో ఒక కొమ్ముతో యేర్పడే అక్షరాలు కొన్ని వున్నవి. సమమయిన రెండు కొమ్ములతో యేర్పడేవి కొన్నివున్నవి. ా గుర్తు తుది కొమ్మమీదనే యిస్తారు. అప్పట్లో ముందు కొమ్ముమీద ✓ గుర్తు (దీనినే తలకట్టు అంటారు) వుండివుంటే అది అట్లే నిలుస్తుంది. ఈ పాఠంలో 'ర,' 'ప,' లకు 'మ' కు అకార దీర్ఘమిచ్చేటప్పుడు యీ భేదము చూడవచ్చును.]

ా

# రా పా మా

## పార రామ రారా పాపా

## పాప రామా మామా

రా రా రా మ　　　రా ర మా మా

రా మా రా ర　　　పా ప రా ర

రా రా పా ప　　　మా మా రా ర

పాఠము ౩

○ ◡ ా

వ ల వా లా

| | | |
|---|---|---|
| వల | మావల | మలమల |
| రవ | పావల | పాపమాల |
| మల | లామా | పాపారావా |

రా మా రా వా

మా **మా** రా వా

పాప **మా**ల పావలా

పరమ పావన రామా

| | | | | |
|---|---|---|---|---|
| ప | మ | ర | ల | వ |

పాఠము ౪

ఒ క ా

ద క దా కా

కల కలప కాక

కవ పలక దాక

పద మరల కాదా

రాకరాక కలకల పదపద

మా పాకదాక రా మామా

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| క | ద | ప | మ | ర | ల | వ |

## పాఠము ౫

౨        ా

# నస        నాసా

| | | |
|---|---|---|
| పనస | సాన | సాదా |
| సలక | వాన | దారా |
| సరద | నార | సామ |

**రారా నానా**

వాన        రాదా

[illegible]        రాదా

| క | ద | న |ప | మ | ర | ల | వ | స |
|---|---|---|---|---|---|---|---|---|

## పాఠము ౬

[○ దీనికి సున్న అనిపేరు. ఒక అక్షరానికి తరువాత దీనిని వ్రాసి తరువాత అక్షరము లేకుంటే ఇది మకారంగా పలుకుతుంది. తరువాత మరియొక అక్షరము కలిస్తే దీనిశబ్దము అవతలి అక్షరాన్ని బట్టి ఙ, ఞ, ణ, న, మ లుగా పలుకుతుంది.]



రం షం లం పం మం

దం కం నం సం

| | | | |
|---|---|---|---|
| వారం | పాదం | లంక | వంద |
| వాలం | హాసం | గంప | వంక |
| పాపం | సాహం | మంద | కంద |

సాం ంకర్

## పాఠము ౭

[ 'ఇ' కారము పలుకవలసివస్తే హల్లు నెత్తిన నిలిచేగుర్తు 'ి' 'ఈ' కారము పలుకవలసివస్తే 'ీ'. కొమ్మువుండే అక్షరమయితే కొమ్ముచివరన చేర్చవలెను. సమంగా రెండుకొమ్ములుంటే మొదటి కొమ్ము చివరన చేర్చవలెను. 'మి' ని 'మి' గా వ్రాయడముంది. 'యి' కి మాత్రము వొక్కటే రూపం, ]

ి

రి వి లి పి మి ది కి ని సి

వరి కవి మిరప
రవి లిపి మినప
సిరి నిసి రవిక
కలి నది పిలక

కానిపని, కిలకిల, విలవిల, మిలమిల, రికరిక
మి ర ప కా య

ీ

రీ వీ లీ పీ మీ దీ కీ నీ సీ

కీసర నీలం మీద
దీవన పీక లీల
వీసం రీతి సీసా

కీసరిదాకా దాసరి రారా

పాఠము ౮

[ 'ఉ' కారము పలుకవలసివస్తే హల్లుకు కుడివైపున 'ు' కొమ్మిస్తాము. 'ఊ' కారము పలుకవలసివస్తే దీనికి 'ూ' ఇట్లా దీర్ఘమిస్తాము. 'ప' 'వ' యీ రెండక్షరాలకు కొమ్ము యిచ్చేటప్పుడు ప్రక్కన యివ్వడం లేదనీ క్రింద ఆరంభించి కుడిప్రక్కకు తెత్తుమని తెలియజెప్పవలెను. ]

ు

రు వు లు పు ము దు కు ను సు

పులుసు దురద నుదురు కుదురు

సులువు నులక ముదురు కాపురము

వాన రాక వరద రాదు

ూ

రూ వూ లూ పూ మూ దూ

పాలూరు మూలము కూనూరు

మావూరు పూమాల దూరము

పూల పాదుకు నీరు పారినది

పూరూర ముదుక నూలు

## పాఠము ౬

[ ఈ పాఠములో 'చ' నేర్పనున్నాము. చ, జ లు రెంటికి రెండేసి యుచ్చారణలున్నవి: నాలుక పండ్లనుతాకి పలికే ఉచ్చారణ వొకటి. అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ లతో చేరినప్పుడే యీ వుచ్చారణ కలుగుతుంది. దీనిని వేరుచేసి చూపడానికి యీ అక్షరాలను యిదివరలో చ, జ, అని వ్రాసేవారు. ఇప్పుడిట్లు వ్రాసేది చాలా అరుదు. రెండవ వుచ్చారణలో నాలుక అంగిటిని సోకుతుంది. ఇ, ఈ, ఎ, ఏ లతో చేర్చినప్పుడీ వుచ్చారణ కలుగుతుంది. ఈ భేదము అభ్యాసము చేతనే తెలియవలెను. ]

డ త చ

డ డా డి డీ డు డూ

త తా తి తీ తు తూ

చ చా చి చీ చు చూ

| | | | | |
|---|---|---|---|---|
| కండ | డాలు | రాండి | తాడు | డూడు |
| ముంత | తాలు | కాంతి | వంతు | తూము |
| మంచము | చాలు | కంచి | చుంచు | చూలు |

రామ నామము పాడుదామా

వాడ వాడన పాడుదామా

వరిమడి కాడ కావలి వుండు

| క | చ | డ | త | ద | న | ప | మ | ల | ర | వ | స |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

## పాఠము ౧౦

[ 'ఎ' కారం పలుకవలసివస్తే హల్లు తలన నిలిచే గుర్తు ె
దీర్ఘానికి ే ]

ె

రె వె లె వె మె దె కె నె సె
డె తె చె

కండె మెలిక నెల రెండు
దంతె సెలవు వెల లెండు
మంచె కెంపు పెడ దెస

ే

రే వే లే వే మే దే కే నే
సే డే తే చే

రేపు వేద కేక డేరా
వేప మేత నేత తేడా
లేత దేవ సేవ చేమ

రేపు మనకు సెలవు

వాడు మంచి నేతకాడు

కలిమి లేములు కావడి కుండలు

## పాఠము ౧౧

[ 'ఒ' త్వము పలుక వలసినస్తే హల్లు నెత్తిన నిలిచేగుర్తు ొ. దీనికి దీర్ఘం ో. ఈ పాఠములో 'మ' కు 'ఒ' త్వ మివ్వడములో కల భేదాన్ని గమనించేది. తెలుగు వాడుక భాషలో 'ఒ' లు పలకడంలేదు. వకారంతో కలిపి 'వొ' 'వో' లుగా పలుకుతారు. ]

### ొ

రొ వొ లొ మొ దొ
కొ నొ సొ డొ త్రొ చొ

రొంపి పొలము కొంచెము తొడ
వొండు మొలక నొసలు చొరవ
లొంగు దొర సొరకాయ డొంక

### ో

రో వో లో పో మో దో
కో నో సో డో త్రో చో

రోలు పోక కోడి తోపు
వోడ మోత నోరు చోడి
లోతు దోమ సోడా డోలు

దూరపు కొండలు నునుపు
కోడికూతతో లేవవలెను
రారా రామా రవికుల సోమా
పిలువని పేరంటమునకు పోరాదు

పాఠము ౧౩

౦ ట గ

య ట గ

యముడు యుగము టపాలు టుంకి
యాగము యూరోపు టాకి టూకీ
యిటుక యెడమ టికెటు టెండరు
యీగ యేడికోల టీ టేకు

నాయెడి టొరాంటో
పొగయోడ టోపి
గడియారము గుడికి పోదము
గాలివాటము గూటికి చేరినది
గిలి కూడదు గెలవేసినది
గీత చదువు గేదెను కొను
గోయి తీయి గోదావరి చూడు

గంగగోవు పాలు గరిటెడైనను చాలు
కంచెయే చేనుమేసిన కాపేమి చేయగలడు ?
నడవడి మంచిదయిన నలుగురు గౌరవింతురు
మంచి యెరువు పంటను పెంచును

క గ చ ట డ త ద న ప మ య ర ల వ స

పాఠము ౧౩

ఐ

బ జ

బండి యిరుసు
బాడిసేల
బిడియపడకు
బీదతనము

బుకాయింపు
బూడిదరంగు
బెంగపడకు
బేడకాసు

బొంగురుగొంతు
బోసినోరు

జనపనార
జారుముడి
జిలకర పోపు
జీడిపండు

జులుము వలదు
జూలుపాడవు
జెండావందనము
జేగురు రంగు

జోట జోట కారు పీరు
జోలె చంకన తగిలించినాడు

క గ చ జ ట డ త ద న ప బ మ య ర ల వ స

## పాఠము ౧౪

[ అన్ని అక్షరాలు అన్ని గుణింతాలు పదాలు మొదట రావు. ఎక్కడో గాని రాని అక్షరాలునూ వున్నవి. 'ణ' పదాదిని రానేరదు. ]

౦ ౬౩

శ ణ

శరీరము శుకుడు బాణలి
శాకపాకాలు శూరుడు గణాచారి
శివుని జడలు శెంబడివాడు గణితము
శీలవంతుడు శేరి తూణీరము

కణుజు చాణూరుడు స్నానము గణేశుడు
శొంటి శోకము

గుణము కలవానిది గెలుపు
కరుణ కలవాడె కలిమి కలవాడు
వీణాగానము వినుటకు సొంపు
పశుపాలనము పరమావసరము
కూరగాయలు దండిగ పండించు, బాగాతిను

క గ చ జ ట డ త ద న ప బ మ
య ర ల వ శ స

పాఠము ౧౩



ళ హ ష

మేళగాడు   వేళాకోళము
కాళిదాసు   పాళీలుకొను

తళుకుబెళుకు

హరి   హుండీ   హొయాంగుహో
హాయి   హూణులు   హోమము

హిమాలయము   హెలెను
హీలియం   హేతువు

షరీకు   షెరాయి
షాపు   షేరు
షికారు   షోలాపురం
షూటింగు   షోలింగరు

క గ చ జ ట డ ణ త ద న ప బ మ
య ర ల వ శ ష స హ ళ

## పాఠము ౧౬

[ ఈ పాఠములో 'ఐ' కార 'ఔ' కారములు హల్లులతో చేరిన రూపాలు నేర్పుతున్నాము. వీటిని అయి, అవులుగానే వ్రాయ వచ్చును. 'రైలు' అనేది 'రయిలు' అనే వ్రాయవచ్చును. 'గౌను' అనేది 'గవును' అనే వ్రాయవచ్చును. ]

ై ఇది 'ఐ' కారానికి గుర్తు. ౌ ఇది 'ఔ' కారానికి గుర్తు.

| | |
|---|---|
| రైలు | జైనులు |
| మైలు | రౌతు |
| బైలు | తౌడు |
| వైనం | దౌడ |
| కైక | నౌక |
| పైకము | చౌక |
| పైరు | కౌరవులు |

నౌకరునకు పైకము కావలెను
రైలుమీద పయనము కులాస
వరి పైరునకు నీరుకావలెను

## పాఠము ౧౪

[ఈపాఠంలోనూ మరి రెండుపాఠాలలోనూ అచ్చులు నేర్పుతున్నాము. తెలుగు వాడుకభాషలో అచ్చంగా మనకు పలికేవి 'అ' 'ఆ' లు మాత్రమే. 'ఇ' 'ఈ' 'ఎ' 'ఏ' లు 'య' కారంతో కలిపే పలుకుతాము. 'ఉ' 'ఊ' 'ఒ' 'ఓ' లు 'వ' తో కలిపే పలుకుతాము. 'ఐ' 'ఔ' లు అయి అవులుగా పలుకుతాము. కాని గ్రంథాలలో ఇవన్నీ కనుపించును.]

౧

| అ | ఆ |
| --- | --- |
| అరటి | ఆటపాటలు |
| అంటుమామిడి | ఆలుమగలు |
| అంగారకుడు | ఆకలిమంటలు |
| అలలు | ఆతుర పడకు |

౨ ౦

| ఇ | ఈ |
| --- | --- |
| ఇరుకు | ఈక |
| ఇంగిలీకము | ఈడిగ |
| ఇండియా | ఈగకాలు |
| ఇంపుసొంపు | ఈతెపోటు |

అ ఆ ఇ ఈ క గ చ జ ట డ ణ త ద న ప బ మ
య ర ల వ శ ష స హ ళ

## పాఠము ౧౮

## ఉ ఊ

| | |
|---|---|
| ఉదయము | ఊరు |
| ఉలి | ఊట |
| ఉపయోగము | ఊడిగము |
| ఉంగరము | ఊగులాడు |

## ఎ ఏ

| | |
|---|---|
| ఎగుడు దిగుడు | ఏటవాలు |
| ఎంత మనిషి | ఏనుగు తొండము |
| ఎండమావులు | ఏతము బావి |
| ఎనిమిది మూర | ఏల పాటలు |

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ క గ చ జ ట డ ణ
త ద న ప బ మ య ర ల వ శ ష స హ ళ

## పాఠము ౧౯

ఒ ఓ

ఒకనికంటె ఒకడుమేలు
ఒకరురసము ఒంటికి మేలు
ఒడలినిండ గంధపు పూత
ఒకనాటి మాట మరునాడు లేదు.
ఓ వాయన ఓ వాయన
ఓరుపు గలవాడె నేరుపు గలవాడు
ఓడ బేరమునకు తెలుగువారిది పేరు
ఓరుగంటికి ఒక మయిలు

ఐ ఔ

ఐలవరము ఔరంగజేబు
ఐరావతము ఔపోసనము

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ క గ చ
జ ట డ ణ త ద న ప బ మ య ర ల
వ శ ష స హ ళ

## పాఠము ౨౦

[ ఇదివరకు అచ్చుగుణింతము, పాఠము లయినవి. ఈ పాఠము నుంచీ హల్లు గుణింతము నేర్పడ మగును. వీటిని వత్తులన్నారు. కొన్ని వత్తులకు తెలుగులో ప్రత్యేకం గుర్తులున్నవి. అవి ఎనిమిది. ఈ పాఠములో నాలుగు, ముందుపాఠములో నాలుగు యివ్వడ మయినది. ]

| కావత్తు | తావత్తు | నావత్తు | మావత్తు |
| --- | --- | --- | --- |
| ్క | ్త | ్న | ్మ |
| అక్క | అత్త | అన్న | అమ్మ |
| పక్క | చెత్త | వెన్న | కమ్మ |
| చుక్క | మత్తు | మన్ను | రెమ్మ |
| చెక్క | యెత్తు | కన్ను | తుమ్మ |

కన్నకూతురు అన్నమాట

పిన్నతమ్ముడు తుమ్మజిగురు

వెన్నకాచిన నేయి మంచిది
అన్నదమ్ములు ఆరగింపుడు.
చెత్త చేరిన చెడుపు గలుగును
యెత్తివేయుము, యెత్తివేయుము.
చుక్కపొడిచెను మేలుకాంచుము
పక్కబొరలకు, పక్కబొరలకు.

## పాఠము ౨౧

| య్యావడి | ర్రావడి | ల్లావత్తు | వ్వావత్తు |
|---|---|---|---|
| ్య | ్ర | ్ల | ్వ |
| అయ్య | కర్రు | అల్లము | కవ్వము |
| బియ్యము | జెర్రి | బెల్లము | దివ్వె |
| పెయ్య | మర్రి | చిల్లర | తవ్వ |

కదురూ కవ్వం కదులుతుంటే కరువు లేనేలేదు

కలరా కాలమున కాచిననీరు త్రాగు

సూర్యుడు పడమట క్రుంకును

కయ్యమునకు కాలు త్రవ్వరాదు

కల్లుత్రాగినవాని ఒల్లు గుల్ల

# పాఠము ౨౨

[తక్కిన హల్లులు వత్తుగా చేరవలసి యుంటే తలకట్టున్న చోట దానిని తీసివేసి టకారమయిన తలమీద నామం తీసివేసి ముందటి హల్లుక్రింద తరువాత హల్లును చేర్చడం జరుగుతుంది. వాళ్ళ "ళ" కారమునకు ద్విత్వము కలిగేటప్పుడు "ళ" క్రింద "్ళ" వత్తియ్యడము కలుగుతుంది.]

ద డ ప

అద్దము అడ్డము కప్ప కళ్ళము

గిద్దెడు గడ్డము దొప్ప వెళ్ళు

హిమాలయము గంగకు పుట్టినిల్లు
హొయాంగుహో చీనాలో గొప్పనది
అచ్చు కట్టుపని అన్నిపనులకు అవసరము

## పాఠము ౨౩

గ్రామము    పుష్పము

క్రొవడి    కష్టము

డ్రాయరు    నష్టము

కొండ తలక్రింద బెట్టుకొని రాళ్ళకు వెనుకనా ?

ఉష్ణమును కొలిచే యంత్రము ఉష్ణమాపకము

యెవరెస్టు ప్రపంచములో యెత్తయిన పర్వతము

## పాఠము ౨౪

[ఈ పాఠములో 'పా' వత్తుకు ఉత్త్వము ఇచ్చేసందర్భము గమనించి చెప్పవలెను. హల్లు వత్తు చేర్చేటప్పుడు అచ్చు గుణకారముచేర్చి హల్లు నెప్పుడూ చేర్చము. వొక పావత్తు విషయంలో మాత్రము 'ప' ను ద్విత్వముచేసి ఉత్త్వము పలుకవలసివస్తే వత్తుకే ఉత్త్వము చేరుస్తున్నాము. అది పైచివరన.

ఇక "ద్రుతము". పాదము అంతమందు నకారము నిలుపడానికి మన వారు కావ్యాలు వ్రాసేటప్పుడు వాడేవారు. అదే అలవాటు వ్యాకరణాలు వ్రాసేవారు పదములకు మధ్యలోనూ అవలంబించి "వచ్చెన్ రాముడు" అనికూడ ఉదహరించినారు. కాని వ్యవహారంలో ఇది యెక్కడా అవసరంగా తోచదు. అయినా కంద పద్యాలు చదువుకోవలసి వచ్చినా, యిది పుస్తకాలు అచ్చు వేయడంలో ఉపయోగిస్తుండడంచేతా దీనిని నేర్పవలసి వుంది.]

| పావత్తు | ద్రుతము |
|---|---|
| ු | ౯ |
| అప్పుచేయరాదు | కలడందురు దీనులయెడ |
| | కలడందురు పరమయోగి |
| నేడు నిప్పులు కురుస్తున్నవి | గణముల పాలకా |
| | కలడందు రన్నిదిశలను |
| డబ్బారేకెట్లా చేస్తారో? | కలడు కలండనెడు వాడు |
| | కలడో లేడో? |

పాఠము ౨౫

[" ౠ " ఇది వట్రువసుడి. ఇది హల్లుగాదు, అచ్చుగాదు. హల్లు రకారము అచ్చు ఇకారము రెండూ ఇందులో పలుకును.

ఋ

కృష్ణుడు
కృత్తిక
వృత్తము

కృష్ణుడు గీతను అర్జునునికి నేర్పెను
కృష్ణుడు బృందావన విహారి
చుక్కల గుంపులలో కృత్తిక వొక్కటి
కృత్తికనే పిల్లలకోడి యందురు
యిది ముత్యాల గుత్తివలె వుండును.

## పాఠము ౨౬

[ హల్లుమాత్రము పలుకవలసివస్తే తలకట్టు తీసివేసి దానికి బదులుగా కుడివైపుకు త్రిప్పిన అరసున్న హల్లునెత్తిన చేరుస్తాము. ]

్

పరాక్
నాయక్
బేషగ్

## పాఠము ౨౭

### రెండు తెలుగు పద్యాలు

౧. అక్కరకురాని చుట్టము
మ్రొక్కిన వరమీనివేల్పు మోహరమున దా
నెక్కిన బారని గుర్రము
గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ॥

౨. అడిగిన జీతం బియ్యని
మిడిమేలపు దొరను గొలిచి మిడుకుట కంటే
వడిగల యెద్దుల గట్టుక
మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ॥

# రెండవ భాగము

## పాఠము ౧

[ తేలిక హల్లుక్రింద నిలువుగీత గీస్తే వొత్తుపలికే వొత్తుహల్లులు అయిదున్నవి. ధ, భ, ఫ, ఛ, ఢ. యిందులో రెండీ పాఠములో, మూడు రెండవ పాఠములో నేర్పడ మవుతుంది. వొత్తిపలికే టప్పటికి 'బ' కు తలకట్టుకూడ చేరింది. ]

| | |
|---|---|
| ద | బ |
| ధ | భ |
| ధర | భరణి |
| ధాన్యము | భారము |
| ధిమిధిమి | భిల్లులు |
| ధీరుడు | భీతి |
| ధూర్తుడు | భుక్తి |
| ధేనువకొండ | భూర్జపత్రము |
| ధోరణి | భేరి |
| | భోరున |

ధాన్యము ధర పెరిగినది

లింకను వీధిదీపముకడ చదువుకొన్నాడు

భయము లేనినాడు జయము నిజము

భూమి సూర్యునిచుట్టు తిరుగును

మత భేదములు కొంపలు తీసినవి.

పాఠము ౨

ప చ డ

ఫ ఛ ఢ

ఫలము ఛాందసము ఢంకా
ఫాయిదా ఛీ ఛీ ఢమ ఢమ ధ్వని
ఫిలుము ఢిల్లీ
ఫ్లూల్సు కేపు
ఫోటో

కష్టము చేసిన ఫలము కలుగును

ఛాందసము మానని జాతి చక్కబడదు

వెలుతురు వెంటనే ఛాయ

ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్

రెండేనాళ్ళలో పట్టుకపోతా౯

## పాఠము ౩

[తేలిక హల్లుతో పోలిక యేమీ లేకుండా వత్తి పలుకడానికి వేరే అక్షరం యేర్పడేవి అయిదున్నవి. ఖ, ఘ, ఝ, ఠ, థ. మామూలు వ్యవహారంలో 'ఝ' విననేవినము. 'థ' కు దదులు 'ధ' నే పలుకుతారు. వ్రాతలో 'థ' కూ 'ధ' కూ పొట్టలో చుక్క ఒక్కటే భేదం. దాన్ని వదలివేస్తూనే వుంటారు.]

# క గ చ

# ఖ ఘ ఝ

ఖలుడు ఘటికాచలం ఝంఝామారుతము
ఖాది ఘాటు మందు

ఖర్జూరము అరేబియాలో బాగా పండును
ఖాదీ కట్టుట కాంగ్రెసు మతము
ఘటికాచలము పుణ్యభూమి
ఘాటుమందు గండము తెచ్చును

# ట త
# ఠ థ

ఠావు కాగితం వెల కాని
థార్ అనేది గొప్ప ఎడారి

# పాఠము ౪

[తెలుగు అక్షరాలలో 'క్ష' అనే అక్షరంకూడ నేర్పడముంది. ఇది నిజంగా 'క' కు 'ష' వత్తిస్తే యేర్పడుతుంది. 'ఞ' అనే అక్షరమూ వొకటివుంది. అది "ఆజ్ఞ" "విజ్ఞానము" ఇట్లాంటి పదాలలో వత్తుగా కనుపిస్తుంది. 'ఙ' మరియొకటి కలదు. బండి 'ర' అనే పేరుగల "ఱ" వొకటుంది. ఇది వాడవలసిన పనేలేదు. కాని పుస్తకాలలో వుంటుంది. నేర్చుట అవసరము. 'క' విసర్గ. "అంతఃకరణ" ప్రాతః కాలము" వగైరా పదాలలో వుంటుంది. 'హ' కారంగా పలుకు తుంది. మరియొకటి అరసున్న 'ఁ'. ఆకారముకొలదీ దీనికీ పేరు కలిగింది. ఇది మూగ. పలుకదు. అయినా తప్పదు. చదువరు లీ యక్షరము వచ్చినపుడు ఇది యేమోనని భ్రమపడకుండా నేర్పడం మంచిది. ఇవన్నీ నేర్పేటప్పుడు "ఇందులో మీకు తెలియనిది క్రొత్తదేదో వచ్చింది గుర్తించండి" అంటూ దాని వివరం వెంటనే చెప్పవలెను. ఆ వుద్దేశంతో క్రిందిపదా లివ్వడ మయినది.

| | | |
|---|---|---|
| క్షామము | ఆజ్ఞ | అంతఃకరణము |
| పక్షి | యజ్ఞము | తేజఃపుంజము |
| క్షేమము | జ్ఞప్తి | దుఃఖము |
| వాఙ్మయము | గుఱ్ఱము | ఆఁడది |
| | మఱ్ఱి | రాముఁడు |
| | ఇఱ్ఱి | |

అక్షరమాల

అ ఆ ఇ ఈ ఉ ఊ

ఎ ఏ ఐ ఒ ఓ ఔ

ం ఁ ః

క ఖ గ ఘ ఙ

చ ౘ ఛ జ ౙ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ఱ ల ళ

వ శ ష స హ క్ష

## పాఠము ౫

[అక్షరాలతో పాటు అంకెలనుకూడ నేర్పవలెను. తెలుగు అంకెలు, ఇంగ్లీషువికూడా.]

| తెలుగు | | ఇంగ్లీషు |
|---|---|---|
| ౧ | ఒకటి | 1 |
| ౨ | రెండు | 2 |
| ౩ | మూడు | 3 |
| ౪ | నాలుగు | 4 |
| ౫ | ఐదు | 5 |
| ౬ | ఆరు | 6 |
| ౭ | ఏడు | 7 |
| ౮ | ఎనిమిది | 8 |
| ౯ | తొమ్మిది | 9 |
| ౧౦ | పది | 10 |

## పాఠము ౬

| తెలుగు | | ఇంగ్లీషు |
| --- | --- | --- |
| ౧౧ | పదకొండు | 11 |
| ౧౨ | పండ్రెండు | 12 |
| ౧౩ | పదమూడు | 13 |
| ౧౪ | పదునాలుగు | 14 |
| ౧౫ | పదిహేను | 15 |
| ౧౬ | పదహారు | 16 |
| ౧౭ | పదిహేడు | 17 |
| ౧౮ | పదునెనిమిది | 18 |
| ౧౯ | పందొమ్మిది | 19 |
| ౨౦ | ఇరవై | 20 |

తరువాత ౨౦ కి ౩౦ కి, ౩౦ కి ౪౦ కి, ౪౦ కి ౫౦ కి, ౫౦కి ౬౦ కి, ౬౦ కి ౭౦ కి, ౭౦ కి ౮౦ కి, ౮౦ కి ౯౦ కి, ౯౦ కి ౧౦౦ కి మధ్య అంకెలు వ్రాయించేది. ఒకటినుండి నూరువరకు అంకెలు వ్రాయండి.

## పాఠము ౭

## అంకెలు - స్థానాలు

# ౧ 1

ఒకట్లస్థానంలో ౧ నుంచి ౯ వరకు ఏదైనా ఉంటుంది.

# ౧౦ 10

ఇది పది. ఇందులో కడపటిసున్నాకు ఎడమది పదులస్థానం. ఇందులో ౧ ఉంటే పది, ౨ ఉంటే రెండుపదులు ఇరువది. ౩ ఉంటే మూడు పదులు ముప్పది. ఇట్లా తొమ్మిది ఉంటే తొంబదివరకు పోతుంది.

| | |
|---|---|
| ౧౦ | 10 |
| ౨౦ | 20 |
| ౩౦ | 30 |
| ౪౦ | 40 |
| ౫౦ | 50 |
| ౬౦ | 60 |
| ౭౦ | 70 |
| ౮౦ | 80 |
| ౯౦ | 90 |

# ౧౦౦ 100

ఇది నూరు. ఇందులో కడపటి రెండుసున్నాలకు ఎడమది నూర్ల స్థానము. ఇక్కడ ౧ నుంచి ౯ వరకు ఉండవచ్చును. నూరు, ఇన్నూరు, మున్నూరు, ఇట్లా తొమ్మిది నూర్లవరకు పలుకుతుంది.

ఇది చూడండి

# ౧౧౧ 111

నూర్ల స్థానంలో ౧ ఉంది కాబట్టి ఒకనూరు

పదుల స్థానంలో ౧ ఉంది కాబట్టి ఒకపది

ఒకట్ల స్థానంలో ౧ ఉంది కాబట్టి ఒకటి

అన్నీ చేరిస్తే నూటపదిపైన ఒకటి, నూటపదకొండు.

ఈ క్రిందివి చదవండి.

| | | | |
|---|---|---|---|
| ౨౩౪ | 234 | ౪౫౯ | 459 |
| ౬౫౬ | 656 | ౭౮౧ | 781 |
| ౮౯౯ | 899 | ౧౧౬ | 116 |

అంకెల స్థానాలలో ఎడమ కెడమకు వ్రాస్తూపోతే ఒకట్లు, పదులు, పదులకు పదులునూర్లు, నూర్లకు పదులువేలు, ఇట్లా విలువ పెరుగుతూ పోతుంది.

**చూడండి**



| | | |
|---|---|---|
| ౧ | ఒకటి | 1 |
| ౧౦ | పది | 10 |
| ౧౦౦ | నూరు | 100 |
| ౧౦౦౦ | వేయి | 1000 |
| ౧౦౦౦౦ | పదివేలు | 10000 |
| ౧౦౦౦౦౦ | లక్ష (నూరువేలకు పేరు) | 100000 |

సర్వోదయ ప్రెస్, పటమటలంక. 1500-11/1956

# పెద్దల విద్యకు పుస్తకాలకు

| | |
|---|---|
| శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి | |
| వయోజనవిద్య - బోధన క్రమము | 1-0-0 |
| డిటో మొదటి పుస్తకము | 0-5-0 |
| డిటో రెండవ పుస్తకము | 0-5-0 |
| డిటో మూడవ పుస్తకము | 0-5-0 |
| శ్రీ హరిసర్వోత్తమ ఛార్టు (పెద్దది) | 0-6-6 |
| డిటో (చిన్నది) | 0-1-0 |
| శ్రీ గోపరాజు రామచంద్రరావు గారి | |
| మా పాఠాలు - మొదటిభాగము | 0-5-0 |
| డిటో రెండవభాగము | 0-5-0 |
| శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారి | |
| వయోజనవిద్య - ప్రబోధగీతాలు | 0-3-0 |
| మదరాసు ప్రభుత్వ ప్రచురణలు | |
| కామయ్య కథ | 0-3-0 |
| మర్యాద రామన్న - అప్పాజీ | 0-2-6 |
| సత్యప్రియత్వము - గాంధీమహాత్ముడు | 0-2-6 |
| అబ్రహాం లింకన్ | 0-2-6 |
| విద్యలోని విలువ | 0-3-0 |
| మన దేశం | 0-3-6 |
| మన శరీరము - ఇతర సంగతులు | 0-3-6 |
| మంచిసంగతులు - మహాపురుషులు | 0-3-6 |
| పెద్దల కథలు | 0-3-0 |
| మనమతం | 0-2-0 |
| క్రొత్త ప్రపంచం | 0-2-0 |
| శ్రీ సురవరము ప్రతాపరెడ్డి గారి | |
| యువజన విజ్ఞానము | 3-0-0 |

# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ ప్రచురణలు

పుర్వోత్తమరావుగారి షష్టిపూర్తి ప్రచురణలు :

| | |
|---|---|
| గ్రంథాలయములు : రిజిస్ట్రీవను | 0-10-0 |
| సభలు – సమావేశములు | 1-4-0 |
| గ్రంథాలయ గీతాలు | 1-0-0 |
| మదరాసు పౌర గ్రంథాలయముల చట్టము | 0-12-0 |
| గ్రంథాలయ పట్టికలు (తయారగుచున్నది) | |

అయ్యంకివారి షష్టిపూర్తి ప్రచురణలు:

| | |
|---|---|
| గ్రంథాలయ సూత్రాలు | 0-8-0 |
| గ్రంథాలయ సూక్తులు | 1-0-0 |
| పఠన మందిరాలు | 1-0-0 |
| గ్రంథాలయ ప్రచారం; విజ్ఞాన వ్యాప్తి | 0-8-0 |
| గ్రంథాలయ సహకారం (తయారగుచున్నది) | |
| తెలుగు పుస్తకాల వర్గీకరణము | 0-5-0 |

ఇతరములు :

| | |
|---|---|
| ౨౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ | 1-8-0 |
| డిటో ఇంగ్లీషు అనుబంధంతో | 2-0-0 |
| ౨౬ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ | 1-0-0 |
| ౨౭ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ | |
| ౨౮ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ | |
| ఆంధ్ర గ్రంథములు ; మొదటిజాబితా | 0-6-0 |
| ముసలమ్మ మరణము (పద్యకావ్యము) | 0-8-0 |
| తెనుఁగు నుడిదండలు | 0-8-0 |

ప్రతులకు :

గ్రంథాలయ పుస్తకశాల

పటమటపోస్టు, కృష్ణా జిల్లా

# వయోజనవిద్య

రెండవపుస్తకము



గాడిచర్ల హరిసర్వోత్తమ రావు, ఎం. ఏ.

# 'మధుర కవి' సూక్తులు

విద్య ధనమిచ్చు, సత్కీర్తి వెలయఁజేయు
బంధుమిత్రుల సమకూర్చు, పదవులొసఁగు
ఐహికాముష్మిక సుఖంబు లందజేయు;
తివిరి మనుజుఁడు విద్య సాధింపవలయు.

చదువుచే ప్రజ్ఞ, దానిచే సరసతయును,
దానిచే కార్యసఫలత, దాన ధనము,
దాన త్యాగము, భోగము, దాన యశము,
దాన సిద్ధించు వాంఛితార్థంబులెల్ల.

ఆర్జనంబున దక్షత, వ్యయమునందు
మితము, సంభాషణంబున చతురతయును,
కార్యములయందు నిపుణత కలుగజేయు;
రమ్యమగు విద్య సమకూర్పరానిదేది ?

నీటఁ జివుకదు, కాలదు నిప్పుసెగకు,
దొరల పాల్గాదు, దొంగలు దోచుకొనరు,
అన్నదమ్ముల పాళ్ళకు నలవికాదు:
మేటి విద్యాధనమునకు చేటులేదు.

ఒరులకిచ్చిన తఱుఁగక పెఱుఁగునంత,
ఉద్దివచ్చునె దీపిక విద్దెతోడ?
ఒరుగాలికి దీపిక యారిపోవు
విద్దెయను దివ్వె యారక వెలుఁగుజువ్వె.

— శ్రీ నాళము కృష్ణారావు

# వయోజన విద్య

## రెండవ పుస్తకము



గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

# తొలి పలుకు

నా మొదటిపుస్తకంలో, చదువుకోకుండా పెరిగిన పెద్దలు చదువను, వ్రాయను కొంత నేర్చుకోడానికి తగిన పాఠాలు కూర్చినాను. ఆ పుస్తకం పూర్తియైన తర్వాత చదవడానికి మరి తగిన పాఠాలేమి కలవని చాలమంది మిత్రులు ప్రశ్నించుచు వచ్చినారు. అట్టి పాఠాలను తయారుచేసి లోకమునకు సమర్పించడమే యీ ప్రచురణములో ఉద్దేశము. ఇందులో రకరకాలైన విషయాలకు సంబంధించిన జ్ఞానము యిముడ్చడానికి ప్రయత్నించినాను. సాధ్యమైనంత తేలికభాషనే ఉపయోగించినాను. పెద్దల చదువు దీని ద్వారా యేమాత్రము అభివృద్ధియైనా సంతోషిస్తాను.

ఇట్లు

గా. హరిసర్వోత్తమరావు

గ్రంథకర్త

# వి ష య సూ చి క


| | |
|---|---|
| ౧. చదువులదేవత | 1 |
| ౨. వేమనచెప్పింది వేదం | 2 |
| ౩. కడుపులో నీళ్ళపీపాలు | 3 |
| ౪. ఇంద్రజాలంకాదు, ప్రకృతి చిత్రం | 4 |
| ౫. లేపాక్షినంది | 5 |
| ౬. సూర్యుడు లేకపోతే ప్రాణంలేదు | 7 |
| ౭. గాంధీమహాత్ముడు | 9 |
| ౮. కైలాసంలో ఈశ్వరుడు | 10 |
| ౯. పంచాయతీ అంటే | 12 |
| ౧౦. తాటిపండ్ల కథ | 14 |
| ౧౧. అందరికి నేనవుదు - నాకందరగుదురు | 17 |
| ౧౨. నీటి ఆవిరి పనిచేస్తుంది | 19 |
| ౧౩. రైలు టిక్కెట్ల సంబరం | 21 |
| ౧౪. వాననీరా ? కాల్వనీరా ? | 23 |
| ౧౫. తేలా ? దోమా ? | 26 |
| ౧౬. చదువెందుకయ్యా ? | 30 |
| ౧౭. ముసలమ్మకథ | 32 |
| ౧౮. ముగ్గుల ముచ్చట | 35 |
| ౧౯. తులసిమొక్క | 37 |

# వయోజన విద్య

## రెండవ పుస్తకము

### ౧. చదువుల దేవత

సరస్వతి చదువుల దేవత. ఆమె వొకచేత పుస్తకము పట్టుకొన్నది. యింకొకచేత వీణ వాయిస్తూ వున్నది. చదువుకు సంగీతానికి దగ్గర చుట్టరికం వుంది. పాటలు పద్యాలు నేర్చుకుంటే త్వరగా చదువుకోవడం నేర్చుకోవచ్చు. హాయిగ, ఆనందంగ కాలం గడపడానికి సంగీతం బాగా సహాయపడుతుంది. పాడుకోండి మరి.

"అంతా రామ మయం
జగమంతా రామమయం."

## ౨. వేమన చెప్పింది వేదం

తెలుగు దేశంలో పిల్లలు, పెద్దలు చెప్పు కునే పద్యాలు వేమన పద్యాలు. "కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా? విశ్వదాభి రామ వినుర వేమ!" అన్నాడు వేమన. "తలలు బోడులైన తలపులు బోడులా?" అనీ అన్నాడు. "పచ్చికాయ తెచ్చి పడవేయ ఫలమౌనె?" అనికూడా అన్నాడు. ఇట్లాటి నీతులు ఆయన పద్యాలలో వేలున్నాయి. జనులలో వుండే లోపాలను దిద్దటానికి చూచిన గొప్పయోగి యితడు. అందుచేతనే వేమన చెప్పింది వేద మయింది.

### ౩. కడుపులో నీళ్ళపీపాలు

మీలో కొందరైనా వొంటెను చూచి వుంటారనుకుంటా. యిది చూడటానికి వికారము గానే వుంటుంది. కాని వొట్టి యిసుక యెడారులలో యీ జంతువు సహాయమే లేకపోతే మనిషి బ్రతకలేడు. యిది దినములకొద్దీ నీరు త్రాగకుండ బరువు మోయగలదు. కారణమేమంటారా! నీళ్ళు నించుకోడానికి దీని దేహంలోనే పెద్ద తిత్తులు యేర్పడి వున్నాయి. పీపాలకు నీరు నింపినట్లుగా వొకే పర్యాయము యిది నీరు నింపుకుంటుంది: కావలసి వచ్చినప్పుడు నీరు దేహానికి సరఫరా చేసుకుంటుంది. యిది సృష్టిలోని చిత్రం. యే ప్రదేశంలో యేజీవి నివసించవలెనో ఆ ప్రదేశానికి తగినట్టుగానే ఆ జీవికి అంగాల అమరిక యేర్పడి వుంటుంది.

౪. ఇంద్రజాలంకాదు, ప్రకృత చిత్రం

గాజు గ్లాసు పట్టుకొని రండి. దానిలో మూడవ వంతుకు నీళ్ళుపోయండి. మైలతుత్తం ఒక అణాపెట్టి కొనండి. రాయిమీద నూరి పొడిచేయండి. ఆ పొడిని నీళ్ళలో వేయండి. కరిగిపోతుంది. రొట్టె కోసే పొడుగాటి చాకు తీసుకోండి. దానిని తెల్లగా తోమండి. దాన్ని ఈ గాజు గ్లాసులోని నీటిలో పెట్టండి. కొంచెం సేపు పెట్టి బయటకు తీయండి. తెల్లటి కత్తి మీద ఎర్రటి రాగి పూత కనిపిస్తుంది. తెలి యని వారు యిది యింద్రజాలం అనుకుంటారు. ఇది యింద్రజాలం కాదు. మైలతుత్తంలో రాగి, గంధకము, ప్రాణవాయువు ఉన్నాయి. శుభ్ర మైన యినుము అందులోని రాగిని లాగేస్తుంది. ఇది ప్రకృతి సిద్ధంగా జరిగే పని. మలాము

పూతలు వేసేవాళ్లు ఇలాటి సృష్టి రహస్యాన్నే వినియోగించు కుంటారు. దీ ని కే రసాయన క్రియ అని పేరు.

## ౫. లేపాక్షి నంది

రాయల సీమలో వున్న క్షేత్రాలలో లేపాక్షి వొకటి. యిది హిందూ పురానికి దగ్గరలో వుంది. యిక్కడి దేవాలయములో యెన్నడో రంగులతో వ్రాసిన రామాయణ, భారత కథల బొమ్మలు యింకా చెక్కు చెదర కుండా వుండడం చూచి అందరూ మెచ్చుకుంటారు. సుందరంగా వున్నాయని సంతోషిస్తారు. వీటితో పాటు దేవాలయనికి ఫర్లాంగు దూరంలో దూరంగా ఒక రాతి బసవన్న కని

పిస్తుంది. ఈ బసవన్న సామాన్యమయిన బసవన్న కాదు. కొండంతటి బసవన్న. వొక రాతిగుట్ట వుంటే దాన్ని మలిచి యీ బసవన్నను తీర్చినారు. చెవులు, గంటలు, గజ్జెలు, గిట్టలు యెంతో అందంగా వున్నాయి. పండుకున్న యీ బసవన్న యెంత యెత్తుంటుందో తెలుసునా? పన్నెండు మూరలకు పయిగా వుంటుంది. పొడుగు యిరవయి మూరలు వుంటుంది. పండుకుంటేనే యింత వుంటే లేస్తే యింకెంతుంటుందో? దీన్ని తీర్చింది పాతకాలపునాటి మన విశ్వబాహ్మణుడు ఢకణాచార్యుడంట. ఆయనది బలే తీరిన చెయ్యి అయి వుంటుంది.

## ౬. సూర్యుడు లేకపోతే ప్రాణంలేదు

సూర్యుడు మనకు చాలా దూరంలో వున్నాడు. ఎంత దూరమో మీకు తెలుసా? తొమ్మిదికోట్ల మైళ్ళు. కోటి అంటే లెక్కపెట్టగలరామరి? పది నూర్లు అయితే ఒక వెయ్యి. అట్లాంటి వేలు నూరయితే వొకలక్ష. అట్లాంటి లక్షలు నూరయితే వొకకోటి. అట్లాంటి తొమ్మిది కోట్లు, అంతదూరంలో వున్నాడు సూర్యుడు. కొండమీది పెద్దచెట్టు దూరంనుంచి మీరు చూస్తే చిన్న మొక్కవలె కనిపిస్తుంది. సూర్యుడు చాల పెద్ద వస్తువు. యింత దూరం వుండడంచేత మన యింట్లో వుంటే పళ్ళెము కంటే పెద్దగా కనిపించడంలేదు. యింక ఆయన వెలుగు, వేడిమి యెంతుందో

మనము లెక్క పెట్టలేము. మన భూమట్లాటివి సూరయితే అయన వళ్ళవుతుంది. అది భగ, భగ, భగ మంటే వేడిగాలే గాని యింకేమీ గాదు. దానినుంచే మనకు వెలుతు రొచ్చేది వేడొచ్చేది. ఆ వెలుతురు, ఆ వేడి లేకపోతే మన భూమిమీద జీవమే ఉండదు. మనుష్యులు వుండరు. జంతువులు వుండవు. ఆయన వుష్ణం కొంచెం తగ్గితే చాలంట - మన భూమంతా చల్లబడిపోవటానికి. కాళ్లు చేతులు చల్లబడితే ప్రాణము పోయిన దంటారు కదా ? యింకే ముంది. సూర్యుడు యీ భూమికి ప్రాణం పోసే వాడు. కాబట్టి సూర్యగోళాన్ని మన పెద్దలు ఆదినారాయణు డన్నారు.

## ౭. గాంధీ మహాత్ముడు

బ్రతికితే గాంధీ బ్రతికినట్లే బ్రతకవలెను. బోసి నోరు, నవ్వు ముఖము, బక్క దేహము. అయినా ఆయన మరణించిన దినం లోకం లోని అన్ని దేశాలవారూ దుఃఖపడినారు. కన్నీళ్ళు విడిచినారు. సానుభూతివార్తలు ఇండియావారికి అందజేసినారు. లోకములో ఇంకొక మనిషి పుట్టలేదన్నారు! ఆయన జీవిత రహస్యం ఏమిటి? ఆడి తప్పలేదు. పలికి బొంకలేదు. ధర్మం విడువలేదు. హింస చేయలేదు. చావుకు భయపడలేదు. తప్పుదిద్దుకోవడంలో వెనకాడ లేదు. శత్రువునైనా ద్వేషించలేదు. అంతా ప్రేమ. అంతా సత్యమే. బ్రిటిషువాళ్ళను గెలవడానికికూడ యివే ఆయుధాలుగా ఉపయోగించినాడు. బుద్ధుడు, క్రీస్తు గాంధీవలె త్యాగాలు చేసినవారే. కాని వారు రాజకీయా

లలో దిగలేదు. దేశపు ప్రజలను రణరంగంలో నడపలేదు. జాతీయ విజయాలు సాధించ లేదు. గాంధీజీ యిదంతా సాధించినాడు. తన మార్గాన్ని దేశంలోని ప్రజలు అనుసరిస్తే లోకంలో శాంతి వుంటుందన్నాడు. ఆయన చెప్పింది ఎంత చేయగలమో మనమే నిర్ణయించుకోవలెను. ఇతరులు ఆయన మార్గాన్ని అనుసరించలేదని దూషించడంలో కాలవారణం చేయకుండా ఎవరిమట్టుకు వారు ఆయన ధోరణిలో జీవితం గడపడానికి ప్రయత్నిస్తే మనం బాగుపడతాం.

౮. కైలాసంలో ఈశ్వరుడు

మన దేశం ఇండియా దేశం. పూర్వులు దీనిని భారతభూమి అనిరి. దీనికి మూడు వైపుల సముద్రము చుట్టుకొని ఉన్నది. ఇది

పడమర, దక్షిణం, తూర్పు దిక్కులు. ఉత్తర దిక్కున పెట్టని కోటవలె హిమాలయ పర్వతములు ఉన్నవి. వీనిపొడవు రెండువేల మైళ్లు, వెడల్పు రెండు వందలు మొదలు నాలుగు వందల వరకు ఉన్నది. ఎత్తు అయిదు న్నర మైళ్ళు. ఈ కొండలమీద మైళ్లదట్టానికి మంచు ఎప్పుడూ పేరుకొని వుంటుంది. ఎండకాలంలో ఈ మంచు కరగడం చేతనే మన గంగా, యమునలకు వరదలు రావడం. అట్లనే సింధు, బ్రహ్మపుత్ర నదులకుకూడ. ఉత్తర ఇండియా లోని వేలమైళ్ళ విస్తీర్ణంలో వరిపంట విస్తారంగా పండడం మన దేశానికి తిండి దొరకడం. పరదేశాలనుంచి శత్రువులు ఉత్తరప్రాంతంనుంచి తోసుకొని రాకుండా ఈ పర్వతాలు మనలను రక్షించినవి. మనలను పోషించి రక్షించిన ఈ పర్వతాలలో

కైలాస శిఖరం ఉంది. ఇంత మహత్తు కలిగిన పర్వతాలలోని ఉన్నత శిఖరంమీద ఈశ్వరుడు వున్నాడని మన పెద్దలు నమ్మినారంటే ఆశ్చర్య మేమీలేదు.

## ౬. పంచాయతీ అంటే?

పంచాయతీ అనే మాట మన దేశంలో అందరికి తెలుసు. ఇద్దరిమధ్య ఏదైనా పోట్లాట వస్తే యిద్దరూ తగిన పెద్దల దగ్గర తీర్మానం చేసుకోవడాన్ని పంచాయతీ చేసుకోవడ మంటారు. ఇట్లాటి తీర్మానాలు కులాలకు సంబంధించినవీ, ఆస్తి పాస్తులకు సంబంధించినవీ, చిల్లర పోట్లాటలకు సంబంధించినవీ యెన్నో యిప్పటికి జరుగుతున్నవి. కోర్టుల కెక్కకుండా యీ విధంగా తీర్మానం చేసుకోవడం అని విధాల మేలని యిప్పటికి చాలామంది నమ్ము తున్నారు. వివాదాల తీర్మానమే గాకుండ

గ్రామానికి సంబంధించిన ఉమ్మడి వ్యవహారా లను పూర్వము పంచాయతులు తీరుస్తూ వుండేవి. అందులో గ్రామ మునసబు, కరణం, పెద్దకాపు, కులపెద్దలు, పురోహితుడు వగైరా అందరూ ఉండేవారు. ఊళ్లో పన్నులు వసూలుచేసి సర్కారుకు ఒప్పజెప్పే బాధ్యత కూడా అనేక సందర్భాలలో వీరిపైనే వుండేది. ఊరి శుభ్రత, ఊరి ఆరోగ్యం, ఊరి వివాద పరిష్కారం, ఊరి సంరక్షణ, ఊరి డొంకలు, బావులు, రస్తాలు, ఊరి ధర్మావా యాలు, అన్నిటినీ వీరు పరిపాలించేవారు. ఊరి లోని వారి అందరిగుట్టూ వీరికి తెలిసి వుండేది. అందరి కష్టాలు వీరెరిగి వుండేవారు. కాబట్టి సర్కారు అనే యంత్రం యొక్క ప్రభావం ఊరిని పాడుచేయకుండా వూరి జీవితం నడిచి పోయేది. ఇటువంటి పంచాయతీలను మళ్ళీ

నెలకొల్పితేనే దేశానికి క్షేమమని, ఇట్టి పంచాయతుల పరంపరే ఢిల్లీప్రభుత్వం వరకు యేర్పర్చవలసిందనీ గాంధీజీ ప్రయత్నపడు చుండినాడు. మన ప్రభుత్వాలు అంత పూర్ణం గా కాకపోయినా కొంతవరకు మన వూళ్లలో పంచాయతుల పరిపాలన యేర్పరచడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నానికి సహా యం చేసి మన వూళ్ల పెత్తనాన్ని నిలుపుకోవడం మనకు మేలు.

౧౦. తాడి పండ్ల కథ

కృష్ణుడనే పేరు మీరందరూ విన్నారు. ఆయన ద్వారకావాసి. చిన్నతనంలో అన్ని ఆటలు ఆడినాడు. అల్లరికూడ చేసినాడు. ఆయన వూరి సమీపంలో ఒక పెద్ద తాటిచెట్ల వన ముంది. మీకందరికి తాటిచెట్టు ఎంతో వుపయోగమయిందో బాగా తెలుసునన

కొంటాను. అయినా పూర్ణముగా తెలియదనే అనుకోవలసి వుంది. ఎందుచేతనంటే చెట్టు వుపయోగాలు చెప్పమంటే మీలో ఎవరిని అడిగినా ఇరవయ్యో ముప్ఫయ్యో వుపయోగాలు చెపుతారు కావలె. ఎనిమిది నూర్ల విధాల తాటిచెట్టు వుపయోగపడుతుందని నాలుగైదు వందల ఏండ్లక్రితం అరవ పండితుడొకాయన పుస్తకం వ్రాసి పెట్టినాడు. మీరు కూడా బాగా ఆలోచించి యింకా తాటిచెట్టు వుపయోగాలు అమలులోకి తెస్తే మనదేశం భాగ్యానికి యీ చెట్లు బాగావనికిరావచ్చు. ఈమాట యెట్లున్నా మన పిల్లలను పెద్దలను అందరిని సులభంగా ఆకర్షించేవి తాటిముంజలు, తేగలు, పండ్లు. పండ్లు మంచి సువాసన గలవి. బీదా సాదా దండిగా తింటారు. ఇట్లాటి సువాసన శ్రీకృష్ణుణ్ణి అతని వెంట

వుండే పిల్లమూకను ఆకర్షించినది. పక్కనుండే తోటలోనికి యీ పండ్లారగింతామని పిల్లల దండు వెడలినారు. శ్రీకృష్ణుడు వారికి నాయకుడు. ఆ తోటను గార్ధభాసురుడనే రాక్షసుడు కావలి కాస్తుండినాడట. గార్ధభాసురుడంటే తెలివిలేని గాడిదవంటి వాడన్నమాట. ఈ పిల్లమూకను ఆతడు తోటలోనికి రానీయలేదు. ఎన్నివిధాల బతిమాలుకొన్నారో మరి తెలియదుకాని, తమపని శాంతవాదంతో సాగకపోతే బలశాలియైన శ్రీకృష్ణుడు యుక్తితో వాణ్ణి దూరం తోసేసి, లోపలికిజొరబడి, తానూ పిల్లలూ తాటిపండ్లను చక్కగా మెక్కినారు. కథ చెప్పడంలో గార్ధభాసురుడు చెడ్డవాడనీ రాక్షసుడనీ, వాణ్ణి శ్రీకృష్ణుడు చంపి వాడికి క్రొత్తజీవితాన్ని సంపాదించి యిచ్చినాడనీ వర్ణిస్తారు.

౧౧, అందరికి నేనవుదు నా కందరగుపురు

మనుష్యులు ఒకరితో ఒకరు పోట్లాడుకో వలసిందేనా? డబ్బు పేరపెట్టుకోవలసిందేనా? యుద్ధాలు చేయవలసిందేనా? రక్తాలు కారవలసిందేనా? ఇవన్నీ ఆస్తి అపరిమితంగా చేర్చడానికి కొందరికే అవకాశం కలగడం చేత పుట్టిన ప్రశ్నలు. నిజమాలోచిస్తే స్వభావంచేత మానవులు అందరూ కలసి సుఖంగా జీవనం చేయవలెననుకునేవారేగాని వేరుకాదు. ఆ స్థితిని పొందవలెనంటే మనము పడుతుండే వ్యవహారపు పోటీలు నశించవలసి వుంది. మనుష్యులు పరస్పరం నడుపుకునే కార్యాలకు ప్రేమ ఆధారం కావలసివుంది. ఎవరికి వారే వ్యవహారం జరుపుకోకుండా అందరూ చేరి జరుపుకోవలసి వుంది. ఒకరి నొకరు సాకుకునే దృష్టిలో పోటీలను తప్పించి

కార్యాలు చేసుకోవలసి వుంది. దీనిని ఆలో చించే సహకారోద్యమం-అంటే మన మీ వేళ శొసైటీలు అని చెప్పుకునే విధానం అమలు లోకి వచ్చింది. అందులో చేరే ఒక్కొక్కడూ తన తోడివారల నడవడికను దిద్దేవాడవుతాడు. వడ్డీ పుచ్చుకొన్నా, లాభం పుచ్చుకొన్నా, ఒక పరిమితికి లోబడే గుత్త పుచ్చుకొన్నా పుచ్చుకుంటాడు. కో-ఆపరేటివ్ సంఘాలలో ఒక మనిషికి ఒక వోటే వుంటుంది. ఒక్కొక్కడు కార్యదర్శిగా, డైరెక్టరుగా పనిచేసే దానికి అవకాశ ముంటుంది. డబ్బుకలవాడు, డబ్బు లేనివాడు అనే భేదముండదు. పరస్పర విశ్వాసము, రుజు ప్రవర్తన, సత్యమైన లెక్కలు యీ శొసైటీల కాధారములు. శోమరి పోతుకు యీ ఉద్యమంలో తావులేదు. చదువు కొనడం అందరు అభ్యాసంచేస్తే యిందులో

ఒకరి నొకరు మోసం చేయదలచుకొన్నా చేయడానికి వీలుండదు. అందుచేతనే ఈ కో ఆపరేటివ్ ఉద్యమంలో చేరినవాళ్లు "అందరికి నే నవుదు, నా కందరగుదురు" అని పాడుకో వడం యేర్పడింది.

### ౧౨. నీటి ఆవిరి పనిచేస్తుంది

ఇంగ్లండులో 'వాట్సు' అని ఒక మనిషి వుండినాడు. సుమారు నాలుగునూర్ల ఏండ్ల కాలం క్రిందంటివాడు. ఆయన వంటదగ్గర కూర్చున్నాడు. పాత్రలో యేమో వుడుకుతూ వుంది. దానిమీద తేలికైన మూత పెట్టినాడు. ఆ మూత తైతక్కలాడుతూ వుంది. మనవాళ్లే యిట్లాటిది చూస్తే పాత్రలోకి దయ్యం దూరిం దిరా అనేవారు. కాని వాట్సు యిట్లాటి పెర్రి నమ్మకాలు కలవాడు కాడు. అందుచేత "నీళ్లు

ఆవిరి అయింది; ఆవిరి బలంతో మూత ను తంతూవుంది. కాబట్టి మూత కదుల్తూ వుంది" అని నిశ్చయించినాడు. ఆవిరిచేత పనిచేయించ వచ్చునని తీర్మానించుకున్నాడు. ఆవిరి యంత్రాన్ని కనిపెట్టినాడు. ఆ దిన మాయన ఆయంత్రం కనిపెట్టబట్టే నేటి రైలు యింజను నడుస్తూవుంది. రకరకాల మరలు సాగుతూ వున్నవి. బుద్ధి ఉపయోగిస్తే క్రొత్త క్రొత్త సాకర్యాలు మనమూ చేసుకొనవచ్చు. వెర్రినమ్మకాలు పెట్టుకుంటే వాటిలో పడి నశించడమే కలుగుతుంది.

## ౧౩. రైలు టిక్కెట్ల సంబరం

కొన్ని యేండ్ల క్రిందట మన దేశంలో రైలంటే యేమో యెరుగని వాళ్లుండినారు. ఈ దినం ఎవ్వరుకూడా బస్సంటే యెరుగని వారు లేరు. రైలంటే తెలియనివారూ లేరు. మైలుదూరం కూడా నడవడం ప్రతివానికీ ఈనాడు కష్టమై పోయింది. బస్సు కనిపిస్తే బస్సు టాపుమీద ఎక్కియైనా ప్రయాణానికి సిద్ధం. రైలు కనిపిస్తే టిక్కెట్టున్నా లేక పోయినా, రైలుబండి పూచలుపట్టుకొని వ్రేలాడుతూ ప్రాణానికికూడా తెగించి బయలుదేరడం పరిపాటి. ఇది చాల విచారకరమైన విషయం. టిక్కెట్లు కొనడానికి సిద్ధపడిన వాళ్లుకూడా క్రమంగా కొనే అలవాటు చేసుకోలేదు. టిక్కెట్టు కిటికీవద్ద గుంపులు గుంపులుగా ఒకరి నొకరు తోసుకుంటూ తమకూ యిబ్బంది

ఇతరులకూ యిబ్బంది కలుగజేసుకుంటు న్నారు. ఒకరివెనక ఒకరుగా నిలిచి టిక్కెట్లు పుచ్చుకుంటే ఎంతమందున్నా సకాలంలో టిక్కెట్టు యివ్వడము వీలుపడుతుంది. గుంపులో గోవిందా అని జరిగే దొంగతనాలూ జరగకుండా తప్పుతాయి. ఒక్కొక్కరు తాము యిచ్చిన డబ్బు సరిగా లెక్కపెట్టుకొని ఎక్కడికి టిక్కెట్టు యిచ్చినారో చూచుకోడానికి కూడ వీలవుతుంది. అందుచేతనే ఈవేళ పెద్ద పెద్ద స్టేషనులలో టిక్కెట్టు కిటికీలవద్ద పోలీసువారిని పెట్టి ఒంటివరుసన పోయేపద్ధతిని అమలులో పెట్టడం జరుగుతుంది. పోలీసువారి జోక్యం లేకుండా ప్రజలే ఈ విధానాన్ని అమల్లో పెడితే చాల మేలు కలుగుతుంది. ఇట్లనే బస్సు టాపుమీద ప్రయాణాలు చేయడం

బస్సులలో రైళ్లలో పూచలకు వేలబడి ఫుట్ బోర్డుల మీద ప్రయాణం చేయడం ప్రజలు మానుకుంటే తమకు క్షేమం. లోకానికి మేలు.

### ౧౪. వాననీరా? కాల్వనీరా?

మానవుడు వ్యవసాయం చేయడానికి మొదలు పెట్టినపుడే పంటలకు నీరు అవసరమనేది తెలుసుకొన్నాడు. అడవి జాతులవాళ్లు కూడా ఒక్కొక్కప్పుడు అడవులలోని బయలు భూములలోని గడ్డి గాదము కాల్చి విత్తనం చల్లి వర్షంకోసం ఎదురు చూస్తుంటారు. బాగా అభివృద్ధిపొందిన మనబోటి వాళ్లమున్నా యిప్పటికీ విస్తారంగా మెట్ట (కుష్కి) పంటలమీదే ఆధారపడుతున్నాము. అంటే భూమిదున్ని, విత్తనంవేసి, వాన కెదురు చూస్తూ కూర్చుంటున్నామన్నమాట. బ్రహ్మాండమైన ఆనకట్టలు

కట్టి, కాలువలు తీసి, నీరు పారించి కోట్ల యెక రాలు సాగుచేస్తూవుండడం నిజమే అయినప్ప టికీ సాగయ్యే భూమిలో ఈవిధంగా నీటివసతి గలభూమి మనదేశంలో ఏ యేడవవంతుగానో కనిపించును. కృష్ణా, గోదావరివంటి మహానదు లలోని నీరు 100 కి 5 వంతులు కూడా మన ముపయోగించుకోవడం లేదు. 95 వంతులు సముద్రంలోనికి ప్రవహించి పోతున్నది. మనము కూటికరువుతో బాధ పడుతున్నాము. దీనికి వేరే కారణం లేదు. మనం మన స్వశక్తి చేత దేవుడిచ్చిన నీటిని సరియైన మార్గాలలో నిలవచేసి పూర్ణంగా వినియోగించుకోవడం లేదు. ఉపాయాలేమో అనేకం మానవుడు కనుక్కొన్నాడు. మన తెలుగు దేశంలోనే రాయలసీమలోనూ, హైదరాబాదు యిలాకా లోనూ, ఎక్కడచూస్తే అక్కడ మన పూర్వీ

కులు పెద్ద చెరువులు కట్టినారు. బావులు త్రవ్వినారు. కాని వాటికి నీరు సరఫరా చేసు కొనే ఉపాయాలుగాని, వాటిని సరియైన మరమ్మతులో పెట్టుకునే ధోరణిగాని లేకపోవడం చేత వాటి ప్రయోజనం తగ్గింది. నేటిదినం మనం స్వతంత్రుల మైనాము. కాబట్టి ఎక్కడి వారక్కడ ఏ కొద్దిపాటి నీరు వినియోగించు కోడానికి వీలుందని తోచినా బాగా ఈవిష యమై కృషి చేసుకోవలసివుంది. వాన కెదురు చూస్తూ 'కూర్చోకుండా భూమి మీద పడిన నీటిని అన్ని ఉపాయాలచేత నిలవచేసుకొని కాలువలద్వారా పారించుకొని మన జీవితాన్ని యింకా సుఖతరం చేసుకోవలసి వున్నది. వాన నీరా? కాలవనీరా? అన్నప్రశ్నకు యిదే సరియైన జవాబు.

## ౧౫. తేలా? దోమా?

మీలో అందరూ తేలునూ చూచివుంటారు, దోమనూ చూచివుంటారు. తేలంటే వొయ్యబొబ్బ విషజంతువు అని ఎక్కడ కనిపిస్తే అక్కడ దానిని చంపివేస్తారు. కుట్టితే ఒక దినమంతా బాధ పడవలసివస్తుందని భయపడడం చేతనే యీ పని చేస్తారు. దోమ చాల చిన్నది. గుంపులు గుంపులుగా మనచుట్టూ తిరుగులాడుతున్నా, గీమని రొదచేస్తున్నా, నిద్ర చెరిచి వేస్తున్నా మనము దీనినిగురించి ఎక్కువజాగ్రత్త పడము. అయితే యిదిచేసే చెరుపు తేలు కూడా చేయదు. తేలు కాటువల్ల యే వ్యాధీ యితరులకు వ్యాపించే స్వభావము దానికి లేదు. దోమకాటుమాత్రం మలేరియా జ్వరాన్ని, అంటే శీతజ్వరాలను మనిషినుండి మనిషికి వ్యాపింప చేయడానికి బాగా తోడ్పడు

తుంది. మురికి గుంటలలో నీళ్లు నిలవయి నప్పుడు దోమలు తండోపతండాలుగా పెరిగి పోతాయి. మలేరియా జ్వరము వచ్చినవారి దేహంలోని మలేరియా క్రిములను యివి సంగ్రహించుకొంటాయి. ఇతరులమీద వ్రాలి వారిని కరచినపుడు యీ క్రిములను వారి దేహంలోకి వ్యాపింపజేస్తాయి. ఆ కారణంచేత ఒక మనిషినుండి ఒక మనిషికి యీ వ్యాధి వ్యాపిస్తూ మన దేశంలో యివ్వాళ లక్షల కొలది జనం నిరంతరమూ యీ రోగంతో బాధపడుతున్నారు. దీనివల్ల కృశించి చచ్చి పోతున్నారు. చిన్నపిల్లల దగ్గరనుంచీ దీని ప్రభావం అందరినీ లొంగదీస్తుంది. కడుపులో బల్లలు, వికారాకారాలు, ఉస్సురో అని శక్తి లేనితనాలు మన జీవితాన్నే కలుషితం చేస్తున్నాయి. సర్కారు లెక్కల ప్రకారం

మన దేశంలో మలేరియావల్ల ప్రాణాలు విడిచేవారు నూటికి 25 మంది వున్నారని తెలిసింది. ఈ రోగాన్ని నిర్మూలనం చేయవలె నంటే దోమలు పుట్టడానికి అవకాశం కలుగ జేసే మురికి నీటి గుంటలు లేకుండా మన గ్రామాలను కాపాడుకోవలెను. విధిలేక మురికి గుంటలుండేచోట కిరసనాయిలో, లేక కిరస నాయిలుతో తయారైన మందో మురికి గుం టలమీద చల్లుతూ వుంటే దోమలు అభివృద్ధి గాకుండా నశించగలవు. మలేరియా జ్వరం సాధారణంగా చలితో వస్తుంది. అట్లా జ్వరం వచ్చినప్పుడు తగిన వైద్యునికి చూపి చికిత్స చేసుకోవడం మంచిది. దీనికి క్వైనా చాలా మంచి మందంటారు. మలేరియా రాకుండా కాపాడుకొనడానికి కూడా క్వైనాను కొద్ది మోతాదులలో తీసుకోవడముంది. క్వైనావల్ల

కలిగే దోషాలును ఉన్నవంటారు. ఈ దోషా లను పరిహరించడానికి నిమ్మకాయ పులుసు లేదా యిటువంటి పులుసుతో చేరిన హైడ్రో క్లోరిక్ ఆసిడ్ అనే ఆమ్లాన్ని వినియోగిస్తారు. పల్లెటూళ్లలో తులసి, వాము కలిపి నూరి తీసు కుంటే కొంత ప్రయోజనం కలుగుతుంది. ఆయుర్వేద వైద్యులు శీతాంకుశరసము అనే మందును వాడతారు. కొంద రందులో ఒక భాగం క్వైనాను కలపడంకూడ కలదు. దోమలు విశేషంగా గల ప్రాంతాలలో నివ సించేవారు దోమతెరలు కట్టుకోవడం మీరు చూచేవుంటారు. కొందరు కొందరు వంటికి వేపనూనె వగైరా రాచుకోవడంకూడ కలదు. ఇవి యెన్ని చేసినా మురికిగుంటలు లేకుండా చూచుకోవడం, ఇంటిలో దుమ్ము, బూజులు లేకుండా చూచుకోవడం, శుభ్రమైన జీవితం

అలవాటు చేసుకోవడం మలేరియాను నిరోధిం చడానికి ఉత్తమ మార్గము.

౧౬. చదువెందుకయ్యా ?

ఈలోకంలో వెలుతురు కోరకుండా చీకటే కోరుకొనేవారెవ్వరూ లేరు. దిక్కులేని స్థితిలో ఎవరైనా చీకటి కొట్టులో పారవేస్తే మనిషి పాలిపోతాడు. కృశించిపోతాడు. బుద్ధి చెడిపోతుంది. పిచ్చికూడ కలుగవచ్చు. ఇది సాధారణంగా అందరూ ఎరిగిన విషయమే. చదువు లేకుండా వుండడమంటే సంఘంలో వున్నా, చీకటిలో వుండడమే. చదువు రాని వాడు తన చుట్టూ యేమి జరుగుతూ వుందో కనుక్కోవడానికి అతనికి శక్తిలేదు: అప్పు తీసు కొన్నప్పుడు వ్రేలిముద్ర వేస్తాడు కాని అక్కడ యేమి వ్రాసి వుందో చదువుకోడానికి తగిన యోగ్యత లేదు. కరణం శిస్తుకు రశీదిస్తే

ఆ రశీదు చదువుకోడానికి యీాయనకు తెలి యదు. పిల్లడు బడికిపోతే అతడేమి చదువు తున్నాడో తెలుసుకొనడానికి ఈయన కర్తాత లేదు. ఇక సమాజంలో వీరికి గౌరవ స్థానమే లేదు. అక్షరం వచ్చినవాడికి కుర్చీ, అక్షరం రానివాడికి నేల. పని చాకచక్యాలు చూదా మంటే చదువు రాకపోతే తానుచేసే పనులలో బాగుపడలేడు. కూలీ చదువుకుంటే మేస్త్రి అవుతాడు. చదువుకోకపోతే కూలీగానే వుంటాడు. కమ్మరి చదువుకుంటే పెద్ద కర్మాగా రంలో పేరు ప్రతిష్ఠలతో బ్రతుకుతాడు. చదువుకోకపోతే బండ్లకమ్ములు కట్టుకోవడాని కంటే యెక్కువ చేయలేడు. చదు వెందుకు కావలెనో యింకా వివరించి చెప్పవలెనా? పుట్టినవాళ్ళంతా చచ్చేవరకూ చదువుకుంటేనే యిప్పటి లోకంలో గౌరవంగా బ్రతకడానికి

అవకాశం వుంది. అందుచేత "చదువుకోండోయ్, చదువుకోండోయ్, చదువురాని పెద్దలంతా చదువుకొందురు గాని రండోయ్" అన్నారు పెద్దలు.

౧౩. ముసలమ్మ కథ

అనంతపురమునకు సమీపమున బుక్కరాయ సముద్రం అను పల్లెటూరు గలదు. అక్కడ ఒక సంపన్న రెడ్డి కుటుంబ ముండెను. ఆ కుటుంబములో మంచి గుణవతి ముసలమ్మ అనునామె పుట్టెను. తల్లి తండ్రులు ఆమెకు సకాలములో వివాహము చేసిరి. ఆమె బసిరెడ్డికి కడకోడలయ్యెను. పుట్టినింటికి మెట్టినింటికి గౌరవం తెస్తూ ఆమె అందరి పొగడ్తలను పొందెను. ఇట్లుండగా ఒకప్పుడు ప్రచండమైన వానలు కురిసెను. కుండలతో

కుమ్మరించినట్లు ఆకాశము, భూమి కన్పించ కుండా యేకధారగా వర్షము వచ్చెను. ఆవూరి ప్రక్కనవున్న పెద్దచెరువు పొంగిపొరలేటట్లుగా నిండిపోయెను. ఏక్షణానికాక్షణం కట్ట తెగు తుందని ప్రజలు భయపడుచుండిరి. ఆవూరి వారికి పాతనమ్మకాలు మెండు. వారు పోతే రమ్మకు పొంగళ్లు చాటించిరి. జాతర జరిగెను. అందులో ఆకాశవాణి పలికిందట. బసిరెడ్డి కడకోడలు ముసలమ్మ గొప్ప పుణ్యమూర్తి. ఆమె బలియైతే మీకు ప్రమాదం తప్పుతుందని చెప్పిందట. ఆమెతో యీవిషయం చెప్పడానికి వూరివారికి నోరాడలేదు. కాని విషయం ఆమెకెట్లో తెలిసింది. ఆమెకూడ ఆకాలపు విశ్వాసాలు కలదే. తాను బలియైతే ప్రజలకు క్షేమ మవుతుందనే విశ్వాసం ఆమెలో వున్న అపారమైన ప్రేమను రెచ్చగొట్టింది. దానితో

ఆమె భర్త, అత్తమామలు, తల్లిదండ్రుల అనుమ
తిని కోరింది. వారు ఎంతఅడ్డముచెప్పినా ఆమె
మానుకోలేదు. ఆమె చూలాలుగాకూడావున్నం
దున ఆమెమీదజాలి వారికందరికీ చాల యెక్కు
వైపోయింది. ఎంత జాలిపడి యెన్ని విధాల
చెప్పినా ఆమె అంగీకరించలేదు. ప్రజల
రక్షణే ఆమెకు విధిగా తోచింది. కాబట్టి
వారందరికి ఎంత యిష్టం లేకపోయినా
ఒప్పుకోవలసి వచ్చింది. పసుపు, కుంకుమ
పూలు మొదలైన సర్వాలంకారములు చేసుకొని
అత్తమామలకు నమస్కరించి, భర్తకు ప్రదక్షిణం
చేసి బలి కావడానికి సిద్ధపడింది. వెళ్లి చెరువులో
దిగిపోయింది: ఊరివారు కన్నీరు రాల్చినారు.
తమ్ము సంరక్షించిన ముసలమ్మను మరువలేరు
గదా ? కనుక ఆ చెరువు కట్టకు వారు ఆమె

పేరు పెట్టినారు. ఇప్పటికీ అచ్చట ఆమెను పూజిస్తున్నారు.

౧౭ ముగ్గుల ముచ్చట

మన దేశపు నాగరికములో ప్రత్యేకమైన గొప్పతనాలు కొన్ని వున్నవి. మన తల్లులు, అక్కలు, చెల్లెండ్రు ప్రతి దినము వేసే ముగ్గుల ముచ్చట ప్రపంచంలో యింకొక దేశంలో వున్నట్లు వినలేదు. అందులోనూ పండుగ దినాలలో, పర్వదినాలలో, ఉత్సవాల సమయాలలో ముగ్గులు తీర్చడమంటే మన ఆడవాండ్లకు చాల సరదా. భోగి పండుగల సమయంలో తెలుగు దేశంలోని పల్లెలయందు యిండ్లముందర అందమైన గుమ్మడి పూల మధ్యన కనిపించే ముగ్గుల ముచ్చట నిజంగా వర్ణించడానికే శక్యముకాదు. ఇట్లాటి ముచ్చట

ప్రతిదినమూ మనము తీర్చుకోవలెనని మన పెద్దల ఉద్దేశము. ఇప్పటికీ యిండ్లు, గుమ్మములు, ముంగిళ్ళు చక్కగా తుడిచి శుభ్రపరచి, అలికి ముగ్గులు పెట్టుకునే పల్లెపట్టు భాగ్యశాలురు యెంతమందో వున్నారు. ఈ ధర్మము బాగా నెరవేర్చుకుంటే శుభ్రత కు శుభ్రత, అందాని కందము, ఆనందాని కానందము మనకు కలుగుతుంది. ఈ ముగ్గుల ముచ్చటలో మన స్త్రీ జనానికి వుండే చేతి పనితనం అద్భుతంగా స్పష్టమవుతుంది. ఈ పనితనాన్ని మన స్త్రీ లోకము చిన్నపిల్లలుగా వున్నప్పటి నుంచే అభ్యాసం చేస్తారు. ఇంత ప్రయోజనకరమైన యీ సదాచారం ఒక్కొక్క కుటుంబానికే కాక గ్రామానికంతటికి క్షేమకరం. అందువల్ల మన దేశపు పురుషులు, స్త్రీలు అందరూ దీనిని గట్టిగా నిలవబెట్టవలసి వున్నది.

## ౧౯. తులసి మొక్క

తెలుగు దేశంలో వూరూరా రామాలయా లున్నట్లే యింటింటా తులసికోట లుంటాయి. తులసి మొక్కలను పెంచడం, తులసిని పూజించడం మన స్త్రీలకు తప్పరాని ఆచారంగా మన పెద్దలు నియమించినారు. ఇక పురుషులలోనూ దేవుని పూజచేసే వారందరూ తెల్లవారేవరకు బుట్టలు చేత పట్టుకొని తులసిదళాలు గిల్లుకొని రావలసిందే. దేవునికి అర్పించవలసిందే. అర్చన పనులలో తులసి కున్న స్థానం యింకొక వస్తువుకు లేదు. తులసి మొక్క కింత అగ్రస్థానం యెందు కొచ్చిందో? పురాణ కథలమాట యెట్లున్నా వైద్యములో తులసికున్న ప్రభావము దీనికింత పలుకుబడిని కలిగించిందని తోస్తుంది. తులసి వాసన పారు

తుంటే విషకీటకాలు ఆ ప్రాంపాలకు రావట. తులసి ఆకుల రసమో, వేళ్ళ రసమో, వీటి కషాయమో తీసుకుంటే అనేక రకాల జ్వరములు తగ్గునట. వరుస జ్వరములలో యిది చాల ప్రయోజనకారి యంటారు. భయముచేత కలిగే జ్వరాల కిది బాగా పనికివచ్చును. కఫ రోగాలకు శ్లేష్మ రోగాలకు యిది మందు. దగ్గు పుప్పసాలలో యిది పనిచేయును. అజీర్ణమును యిది పోగొట్టును. సుఖవిరోచనమును కల్గించును. తులసి గుణాలిం కా యెన్నో వ్రాసినారు.

తులసిమొక్కలు రెండురకాలవి వున్నవి. ఒకటి సాదా తులసి మొక్క. రెండవది కృష్ణ తులసి. మామూలు తులసి చెట్టువలె గాక దీని ఆకులును, కాడలును నల్లగా నుండుటచేత

దీనిని కృష్ణతులసి యందురు. ఇది సాదా తులసి కంటె యెక్కువ గుణముకలది. దీని యుపయోగాలను గురించి 'వస్తుగుణ మహో దధి'లో ఇట్లు వ్రాసిరి.

"దీని రసములో అల్లము లేక శొంఠి రసమును చేర్చి యిచ్చినను, లేదా తేనెచేర్చి యిచ్చినను పసిపిల్లల దగ్గులు, కడుపుబ్బర ములు, కడుపు నొప్పులు మున్నగునవి నశించును. కార్జములోని వ్యాధులను హరించును. నిమ్మకాయ రసములో ఈయాకు నూరి పూసినచో తామర మున్నగు చర్మరోగములను, కుష్ఠములను, క్రిములను నశింపజేయును. ఆకులనుగాని, వేరునుగాని నూరి యిచ్చిన సర్ప విషములు నశించును. ఈ ఆకులను ఎండించి

పొడిచేసి పీల్చిన నాసారోగములు (పీనస, ముక్కులోని పుండు, ముక్కిడి మొదలైనవి) నశించును. వేరు రసమును లేదా ఆకు రసమును విడువక పుచ్చుకొన్న యెడల వరుస జ్వరములు, అడవి జ్వరములు (మలేరియా మున్నగునవి) నశించును. రసపు ప్రమాణము పూటకు 2, 3 తులముల యెత్తును, కషాయపు మోతాదు 5, 6 తులముల యెత్తును, చూర్ణపు మోతాదు ఒక చిన్నము ఎత్తును మించరాదు''

# ఆంధ్రమాతృస్తవము

మా తెలుగు తల్లికి
మల్లెపూదండ
మాకన్నతల్లికీ
మంగళారతులు

కడుపులో బంగారు - కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు - దొర్లించు మాతల్లి

గలగలా గోదారి - కదలిపోతుంటే
బిరబిరా కృష్ణమ్మ - పరుగులిడుతుంటే

బంగారుపంటలే - పండుతాయీ
మురిపేల ముత్యాలు - దొరలుతాయీ

అమరావతీ నగర - అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో - తారాడు నాదాలు
తిక్కయ్య కలములో - తీయందనాలు

నిత్యమై, నిఖిలమై - నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి - మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి - కృష్ణరాయని కీర్తి
మాచెవుల రింగుమని - మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం - నీపాటలే పాడుతాం

జై తెలుగుతల్లీ! జై తెలుగుతల్లీ!
మా తెలుగు తల్లీ!

'తెలుగు తల్లి' నుండి

# గ్రంథాలయ సర్వస్వము

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘపక్షమున వెలువడు

సచిత్ర మాసపత్రిక

: సంపాదకులు :

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ., శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్య, శ్రీ జాస్తి వేంకటనరసయ్య, ఉ. భా. ప్ర., శ్రీ పాతూరి నాగభూషణం, డి. యల్. యస్.

గ్రంథాలయములు, వయోజనవిద్య, ఆంధ్ర వాఙ్మయః ఆంధ్ర సంస్కృతులకు సంబంధించిన వ్యాసములు, వార్తలు, విశేషాలు, గ్రంథ - పత్రికా సమీక్షలతో ఇది ప్రతినెల 25 వ తేదీ వెలువడుచుండును.

సంవత్సరచందా — అయిదు రూపాయలు

వివరాలకు: కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము

పటమట పోస్టు, కృష్ణా జిల్లా.

# గ్రంథాలయ గీతాలు

సంపాదకుడు: పాతూరి నాగభూషణం

సుప్రసిద్ధకవుల, అనుభవజ్ఞులగు కార్యకర్తల రచనల సంపుటి.

గ్రంథాలయాలకు, వయోజనవిద్యకు సంబంధించిన ప్రబోధ గీతాలు-పద్యాలు, పాటలు, బుర్రకథ, బుడబుక్కలకథ, జాతీయ గీతాలు యిందులో గలవు.

విద్యార్థులకు, వయోజనవిద్యా సేవకులకు చాల ఉపయోగకరమైనది. ప్రతి పాఠశాలలోను, గ్రంథాలయములోను ఉండదగినది.

వెల : ఒక రూపాయి

ప్రతులకు: గ్రంథాలయ పుస్తకశాల, పటమటపోస్టు, కృష్ణాజిల్లా

# వయోజనవిద్య

మూడవ పుస్తకము



అబ్రహాం లింకన్

కర్త: గాడిచర్ల హరిసర్వోత్తమరావు

# అందరికీ పుస్తకాలు

## శ్రీ పాటూరి నాగభూషణం

అందరకు పుస్తకాల్ – అంధులకు పుస్తకాల్
పిల్లలకు పెద్దలకు – ఎల్లరకు పుస్తకాల్ ॥అంద॥

౧. నారీమతల్లులకు – నోర్లేనివారలకు
కలవారలకు లేని – కటిక బీదలకును ॥అంద॥

౨. పనిలేక తిరిగేటి – పట్టణ వాసులకు
పగలెల్ల పాటుపడు – పల్లె జనమునకెల్ల ॥అంద॥

3. పేటలో గ్రంథాలు – కోటలో గ్రంథాలు
బోటులో గ్రంథాలు – బాటలో గ్రంథాలు ॥అంద॥

౪. స్వేచ్ఛగా తిరిగేటి – స్వచ్ఛందవాదులకు
ఖైదులో మగ్గేటి – ఖైదీలతో సహా ॥అంద॥

౫. రోగములతో కుళ్లు – రోగిష్ఠులకెగాక
శారీరమున మంచి – ఆరోగ్యమున్గల్గు ॥అంద॥

౬. చదువనేర్చినయట్టి – చదువజాలనియట్టి
పండిత పామర – మండలికి సంతాను ॥అంద॥

('గ్రంథాలయ గీతాలు' నుండి)

45

# వయోజన విద్య

## మూడవ పుస్తకము



గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

# ప్రకాశకుల విజ్ఞప్తి

ఈ గ్రంథము 1953 అక్టోబరులో మొదటిసారిగా ప్రచురింప బడినది. హైదరాబాదు ప్రభుత్వంవారి ఆదరణమూలంగా 1955 ఫిబ్రవరిలో రెండవసారి అచ్చుకు నోచుకున్నది. ఇప్పుడిది మూడవముద్రణమును పొందుచున్నది.

ప్రభుత్వ ప్రణాళికల నిర్వహణకు లక్షలు ఖర్చవుతున్నాయి. క్రొత్తగా అక్షరాస్యులైనవారి కెంతగనో ఉపకరించు నిట్టి గ్రంథములను వెదకి ప్రచారంలోనికి తీసుకొనిరావలసిన విధి యీ ప్రణాళిక నిర్వాహకులపై నున్నది. దీనిని వారు గుర్తించిననా డీలాటి పుస్తకాలెన్నో వెలువడుట కవకాశ మేర్పడును.

గ్రంథకర్త పూజ్యులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారికి, ప్రత్యేక వ్యాసములను వ్రాసియిచ్చినట్టియు, ఇతరత్రా ప్రచురింపబడిన తమ రచనల నిందులో చేర్చుకొనుట కనుమతించినట్టియు ఇతర పెద్దలకు, యీ సందర్భమున మాకృతజ్ఞతను మరొకసారి తెలియజేయుచున్నాము.

ఈ గ్రంథమును ఇంతకంటె హెచ్చు ఆకర్షవంతముగ అందజేయు ఆలోచన మా కున్నది. ఇట్టి అవకాశమును మాకు కల్పించుటకై ఉద్యమ కార్యకర్తలు, ప్రభుత్వోద్యోగులు ముందుకు రాగలరని ఆశించుచున్నాము.

# తొలి పలుకు

ఈ పుస్తకం వ్రాయడంలో నే నొక్కడనే మొదటినుంచీ తుదివరకూ వ్రాయడం చదువరుల కంత రుచికరంగా వుండదేమోనని యింకా కొందరిని ప్రార్థించి వారిచేత యిందులోని పాఠాలు కొన్ని వ్రాయించినాను. ఇదివరకు యితరత్రా ప్రకటితమైనవికూడ రచయితల అనుమతి పొంది రెండు, మూడు యిందులో చేర్చినాను. నాకు సకలవిధముల తోడ్పడిన వారందరికినీ కృతజ్ఞణ్ణి. వివిధ రచయితలు వ్రాసిన పాఠాలతో కూడిన యీ మూడవ పుస్తకం కొంతవరకు చదువను, వ్రాయను సాధించిన పెద్దలకు బాగా ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను.

ఇట్లు

గా. హరిసర్వోత్తమరావు

గ్రంథకర్త

# వి ష య సూ చి క

పుట

1. రాజ్యమేలిన వడ్రంగి కుర్రవాడు 1

2. మన ఆహారం 3

— శ్రీ కాళీపట్నపు కొండయ్య

3. పండ్లతోటలు 6

— శ్రీ గోటేటి జోగిరాజు

4. పళ్లెందుకురా? 8

5. అభిప్రాయభేదము (కథ) 10

— శ్రీ చింతా దీక్షితులు

6. అన్నిటికీ అలవాటే మూలం 14

7. పంచాయతీలు 17

8. వనములు - వనమహోత్సవాలు 19

9. వోటిచ్చునప్పుడే వుండాలె బుద్ధి (గేయం) 21

— శ్రీ కాశోజీ నారాయణరావు

10. గోడ వార్తాపత్రిక (సంభాషణ) 22

— శ్రీ బండి నాగేశ్వరరావు

11. వర్షం యెట్లు వస్తుంది? 25

— శ్రీ గోపరాజు రామచంద్రరావు

12. దేవాలయం - గ్రంధాలయం 28

— శ్రీ పాతూరి నాగభూషణం

13. సహకార విధానం 31

14. దేశభక్తి (గేయం) 33

— గురజాడ అప్పారావు



వాయు వెట్టులు స్వేచ్ఛమై ప్రజకు దొరుకు
నట్లె జ్ఞానంబు కూడను నబ్బవలయు

ఉదక మెల్లర కేరీతి నొదవు నట్లె
జ్ఞానముంగూడ సేవ్యంబు గాగవలయు

సూర్యచంద్రుల తేజంబు చూరలాడ
నెల్లవారికి లభ్యమై యొసగునట్లె
జ్ఞానమునుగూడ సులభంబు గాగవలయు.



# వయోజనవిద్య

## మూడవ పుస్తకము

### ౧. రాజ్యమేలిన వడ్రంగి కుర్రవాడు

### (లింకను చరిత్ర)

లింకను వడ్రంగి కుర్రవాడు. నిరుపేదరికములో పుట్టినవాడు. తల్లి దండ్రులు కడు బీదలైనందున బాలుడు లింకనుకు తిండికూడ పెట్ట లేనివారైరి. అందుచేత మన పసులకాపరి పిల్లలవలె చిన్నతనములో అతడును కూలి చేయవలసి వచ్చెను. అతని తల్లిదండ్రులు అతనిని బడికి పంపలేకపోయిరి. చదువు చెప్పించలేక పోయిరి.

అతడు మంచి తెలివిగలవాడు. చదివితే బాగుపడవచ్చునని సంకల్పించినాడు. ఎంత కష్టమైనాసరే చదువుకొని తీరవలెనని సంకల్పించినాడు. కష్టం చేస్తూనే శ్రమపడి గుర్రపుశాలలోని దీపం దగ్గర యెట్లెట్లో పుస్తకాలు సంపాదించి తానే కష్టపడి చదువుకొన్నాడు.

కసాయివానిదగ్గర నౌకరిచేసి, పడవలకు బరువులెత్తి కూలి సంపాదించుకొనుచుండిన లింకను అంగట్లో గుమాస్తా అయినాడు. నెమ్మదిగా భాగస్తుడైనాడు. నీతి నియమాలతో ప్రవర్తించినాడు. సత్యము పాటించినాడు. దినదినమూ జీవితములో యెక్కి వచ్చినాడు. పేరుప్రతిష్ఠలు పొందినాడు.

ఇతని ఋజుప్రవర్తనమునకు ఒక ఉదాహరణం వినండి. కొట్టులో వస్తువు లమ్ముతున్నాడు. ముసలామె ఒకతెవచ్చి వస్తు వొకటి కొన్నది. పొరపాటున రెట్టింపునబ్బు చెల్లించినది. లింకను

అప్పుడు గమనించలేదు. రాత్రి లెక్కకట్టినప్పుడు యీ విషయం తేలినది. ఆమె యిచ్చిన హెచ్చుమొత్తమును ఆమెయింటికిపోయి యిచ్చివచ్చినాడు. ఇట్లాటిసంభవాలులింకనుచరిత్రలో ఎన్నోవున్నవి.

శీలముకలవాడు కావుననే యీయన మెట్టుమెట్టుగా అభివృద్ధి పొందినాడు. తుదకు అమెరికాదేశమునకు అధ్యక్షుడైనాడు. ఆ పదవిలోనూ చాల గొప్పతనమును కనబరచినాడు. ఇతరుల మేలే తనమేలుగా యెంచుకొని ప్రవర్తించినాడు. ఆ కాలములో అమెరికాలో బానిసత్వం వుండేది. ధనవంతులు మనుష్యులను కొని వీరిని పశువులవలెచూచి పనులు చేయించుకొనువారు. ఈ పాపమును నిర్మూలనముచేయుటకు లింకను కంకణము కట్టినాడు. దీనిమూలమున ఆ రాజ్యములోని ఉత్తరసీమలకును, దక్షిణ సీమలకును అంతర్యుద్ధముకూడ సంభవించినది. అయినను లింకను వెనుదీయలేదు. హోరాహోరిగా యుద్ధముసాగించి జయించినాడు. ఆ విజయమె యితని చావునకు మూలమైనది. విజయోత్సవములు జరుగునప్పుడు యీయన నాటకప్రదర్శనము చూస్తూ కూర్చొని యుండగా ఒక దుర్మార్గుడు యితనిని గుండుపెట్టి కాల్చినాడు.

ఇతని ఆత్మసమర్పణం ప్రపంచంలో ప్రజల పరిపాలనను స్థిరపరచినది. 'ప్రజలకొరకు ప్రజలే ప్రజలరాజ్యము నేలుకొనుట ప్రజాపరిపాలన ఆదర్శ' మని యితని సూక్తి. ఇది నేడు స్థిరపడి పూర్తిగా అమలులోనికి వచ్చునట్టి పరిస్థితు లేర్పడినవి. ఆదారిని లోకమును నడపించుటకు మన మాతృభూమియైన భారతదేశం ఒక్కటే శక్తికలదిగా కనుపించుచున్నది. లింకను ప్రాణత్యాగం అమెరికాను పునీతంచేసినట్లే గాంధీమహాత్ముని ప్రాణత్యాగం మన భూమిని పునీతంచేసినది. ప్రపంచ వ్యవహారాలలో నేటిదినం మనం మధ్యవర్తులుగావుండి ప్రపంచశాంతిని కాపాడే యోగ్యత మనకు కలిగినది. ఇది ఫలప్రదం అగుగాక !

## ౨. మన ఆహారం

కడుపునిండా అన్నం తిన్నావా? అని అడగడం మన కలవాటు కాని పోషకమైన ఆహారం తిన్నావా? అని కాదు. పాడీ పంటా బాగావుండి ప్రాకృతిక పరిస్థితులలో కాపురంచేస్తుంటే యిలా అడగకపోయినా యిబ్బందిలేదు. కాని ప్రస్తుతదేశంలో యీ ప్రశ్న చాలా అవసరం. ప్రజలలో చాలామందికి అసలు తినడానికి ఆహారం లేదన్నమాట అటుంచండి. తినేదయినా పోషకమైనదా కాదా అన్న విషయం మరింత ప్రాముఖ్యమైనది. సంప్రదాయ సిద్ధంగా వస్తూవున్న భోజనపదార్థాలతో కడుపునిండడమే తిన్నవాడికీ తిననివాడికీ వుండే తేడా అని యెంచుతూ వుండడమువల్ల సామాన్యంగా ఆ పదార్థాల పోషకగుణాన్నిగురించి యోచనే కలుగదు. కొంతకాలంక్రితం యీదేశంలోకూడా యీసంబంధమైన పరిశోధన ప్రారంభమయింది. కూనూరులోని 'న్యూట్రిషన్ రిసెర్చి లేబరేటరీస్' లోనూ, యింకా కొన్నిచోట్ల యీ కృషి జరుగుతోంది. కూనూరులోని పరిశోధనాలయానికి డైరెక్టరుగావుండిన డబ్లియు. ఆర్. ఏక్రోయిడ్, బి. జి. కృష్ణన్ అనే ఆయనా కలిసి దక్షిణాన్ని చంగల్పట్టుజిల్లాలోనూ, తిరుచనాపల్లి జల్లాదగ్గరా పల్లెటూళ్ళలోని కొన్నికుటుంబాలు తినే ఆహారంగురించి పరిశోధనచేసి అందులోని లోటుపాట్లు వివరించారు (ఇండియన్ జర్నల్ ఆఫ్ మెడికల్ రిసెర్చి, 1937 జనవరి). మనం తినే ఆహారంలో ముఖ్యంగా అయిదురకాల పదార్థాలు శరీరపోషణకు సరిపడినంతగా వుండాలి.

1. కార్బోహైడ్రేట్లు : బియ్యం, గోధుమ మొదలైన ధాన్యాలూ, పంచదార యీరకంలోనివి.

2. ప్రోటీనులు : కంది, పెసర వగైరా పప్పుదినుసులూ, మాంసం వగైరాలూ యీతరగతికి చెందినవి.

3. తైలాదులు : వెన్న, నేయీ, నూనె మొదలైనవి.

4. ధాతులవణములు : ఉప్పూ, లోహం, కాల్సియం మొదలైన ధాతువుల లవణములూ యీజాతిలోనివి.

5. విటమినులు : పచ్చని ఆకుకూరలూ, పళ్ళూ, పాలూ మొదలైన వాటిలోవుండే పటుత్వమైన పదార్థాలివి.

ఇందులో యేరకం పదార్థం తక్కువైనా శరీర పాటవం చెడుతుంది. ఒక్కొక్కరకం పదార్థం లోపమైతే ఒక్కొక్కరకం వికారం కలుగుతుంది శరీరంలో. ఇటీవల జరుగుతున్న పరిశోధనల వల్ల యీవిషయమైన జ్ఞానం చాలా యెక్కువయింది.

మనం మామూలుగాతినే ఆహారంలో ఏక్రోయిడ్ గారు చాలా లోపాలుకనపరచి సుపోషకమైన ఆహారం సూచించారు. ఈక్రింద పట్టికవల్ల మనఆహారం సుపోషకం కావడానికి ఏవిధంగా వుండాలో విశదమవుతుంది.

| పోషకంకాని ఆహారం | | | సుపోషకమైన ఆహారం | | |
|---|---|---|---|---|---|
| ధాన్యములు | 50 | తులాలు | ధాన్యములు | 37½ | తులాలు |
| కూరలు | 5 | తులాలు | పప్పు | 7½ | తులాలు |
| పప్పు | 2½ | తులాలు | పాలు | 12 | తులాలు |
| పాలు | 5 | తులాలు | ఆకుకూరలు | 10 | తులాలు |
| తైలాదులు | 1½ | తులాలు | తైలాదులు | 5 | తులాలు |
| | | | పళ్ళు | 5 | తులాలు |

అసలు ఆహారమే దొరకనప్పుడు పోషకాహారమేమిటి అని అనవచ్చు. కాని ఆసమస్య తీరనిదే నీరసాహారంతప్ప మరొకటి కూడదనేవారెవరూ వుండరు. అసలు ఆహారమంటూ

యేదో ఒకటి తింటున్నప్పుడు అందులోనే సాధ్యమైనంతవరకు పోషకపదార్థాలను యిముడ్చుకోవడం అత్యవసరం. ఇంతకీ వున్న దానితో సంప్రదాయంగా అలవాటైన భోజనం చేయడమేగాని డబ్బున్నవాళ్లుమాత్రం సరైన ఆహారం తీసుకొంటున్నారు గనుకనా :

ఆహారవిజ్ఞానం కొంత తెలిసి కాస్త శ్రద్ధవుంటే ప్రతివారూ సంపాదించుకోగల పోషకపదార్థాలు కొన్ని లేకపోవు. ఆహారం నిమిత్తం అసలు ఖర్చంటూ కొంతచేస్తున్న ప్రతివారూ పదార్థాల పోషకగుణం గుర్తించి తదనుగుణంగా ఖర్చుపెట్టుకొంటే, కొంత కాకపోతే కొంతైనా లాభం లేకపోదు. కూనూరు పరిశోధనాలయం డైరెక్టరుగారే యీ ఆహారవిషయం గురించి ప్రత్యేకంగా ఒక 'హెల్త్ బులెటిన్' (ఆరోగ్య ప్రణాళిక) ప్రకటించారు. ఢిల్లీలోని గవర్నమెంటు పబ్లికేషన్సు మేనేజరుగారివద్ద యిది దొరుకుతుంది. ఇందులో యించుమించు రెండువందల తినుబండారాలలో కార్బోహైడ్రేటు మొదలైన పదార్థాలు యెంతెంతవున్నవో తెలిపే వివరాలూ, ఆహారసందర్భంలో ఆధునిక పరిశోధనలవల్ల తేలిన విషయాలూ వున్నవి.

( 'విజ్ఞానం' పత్రిక మొదటిసంపుటం 2 వ సంచిక నుండి )

## 3. పండ్లతోటలు

అరటి, మామిడి, జామి యివి తెలుగు సీమలో తరుచు పెంచబడే పండ్లజాతులు. కొన్నిచోట్ల సపోటాతోటలు వేయడం ప్రారంభమైనది. పనస, గులాబీజామి వగైరా యితర పండ్ల జాతుల చెట్లనుకూడా ఒకటి రెంటిని పై జాతుల తోటలలో నాటి పెంచడం కద్దు. బొప్పాయిచెట్లనుకూడా ప్రత్యేకంగాగాని, యితరజాతులతోటలలోగాని పెంచడం ప్రారంభమైనది.

మామిడి, పనస యివి పెద్దచెట్లుగా యెదుగును. జామి, నారింజ అంతకంటె చిన్నచెట్లు. విత్తనములునాటి పెంచిన మొక్కలనుగాని, వీనికి గట్టిన అంట్లనుగాని నాటి యిట్టి చెట్లను పెంతురు. ఇవి కాపుపట్టినతర్వాత పెక్కు సంవత్సరములు యేటేటా కాస్తూవుంటవి. అరటిచెట్లను పిల్కలు నాటి పెంతురు. ప్రతి చెట్టూ ఒక గెలవేసి చస్తుంది. ఈలోపల దుంపనుండి పిల్కలు బయలుదేరి యెదిగి ఒక్కొక్కగెల వేస్తాయి. అనాస యిట్లు పిల్కలుపెట్టి దుబ్బుగా పెరిగే మరియొక ఫలజాతి. లతగా యెదిగే బహువార్షిక ఫలజాతులలో ద్రాక్ష ప్రధానమైనది. కర్బూజా గుమ్మడిపాదులవలె యేటా విత్తి పెంచబడే ఫలజాతి లత. సీమ వంగ మరియొక్క యేకవార్షిక జాతి మొక్క.

మామిడి, పనస, జామి వగైరా జాతులు ఉష్ణప్రదేశాలలో బాగా పెరిగి ఫలిస్తవి. ద్రాక్ష, దానిమ్మ, కాశీ రేగు, అంజూర వగైరా కొన్ని జాతులకు శీతకాలంలో యింతకంటె చలి యెక్కువగా వుండి గాలిలో చెమ్మ తక్కువగా వుండే ప్రదేశాలు అనుకూలం. సీమ రేగు (ఆపిల్), బేరి (పేర్) చెట్లకు నీలగిరివంటి ఖ్యాతైన శీతల ప్రదేశాలు కావాలి.

కొద్ది చోటు మాత్రమే ఆక్రమించుకొనే సీమవంగ, అనాస, అరటి, బొప్పాయి, అంజూర, దానిమ్మ, ద్రాక్ష వగైరా కొన్ని జాతుల పండ్లను తోటలలో అమ్మకానికిగాను ప్రత్యేకంగానే కాక సామాన్య గృహస్థులు తమ పెరళ్ళలో సులభంగా పెంచుకొని తినవచ్చును. ప్రతి పూటా యితర ఆహారపదార్థాలతోపాటు ఒకటి రెండు పండ్లను తినడం ఆరోగ్యకరం.

అరటిపండ్లు, బొప్పాయిపండ్లు, జామిపండ్లు కొంచెం యించుమించు అన్ని ఋతువులలోనూ లభిస్తాయి. సపోటాపండ్లు కూడా వర్ష శరత్ ఋతువులలో గాక తక్కిన కాలాల్లో కొద్ది గొప్ప దొరుకుతాయి. మామిడి, పనస, అనాస - యీ పండ్లు వసంత గ్రీష్మఋతువులలో వస్తాయి. తీయ నారింజ (చీనీ, బత్తాయి) పండ్లు వర్ష, శరత్, శిశిర ఋతువులలోనూ, దేశవాళీ నారింజపండ్లు శరత్, శిశిర, వసంత ఋతువులలోనూ తినుట కనుకూలంగా వుంటాయి. సీమవంగ పండ్లు శరత్, శిశిర ఋతువులలో ఫలిస్తాయి.

కొన్నిచోట్ల స్వతస్సిద్ధంగా పెరిగే చెట్టు చేమలనుండి బీద సాదలకు కొనకుండానే కొన్ని జాతుల పండ్లు లభిస్తాయి. అట్టిపండ్ల జాతులలో సీతాఫలం, రామాఫలం, తాటి, యీత, అల్లి, పాల, చిరివాక యివి ముఖ్యం. ఇవి పట్టణాలలోనూ, పెద్ద గ్రామాలలోనూ అమ్మకానికికూడా వస్తూ వుంటాయి.

## ర. పళ్ళెందుకురా?

మానవుడు తినే తిండిని జీర్ణం చేసుకోడానికి పండ్లు ప్రధానమైన సాధనాలు. ఆహారాన్ని చక్కగా నమిలి తినడం ఆరోగ్యానికి మొదటి సూత్రం.

మనలో చాలమంది చిటుకలమీద భోజనంచేసి లేచిపోయే వారున్నారు. కొందరు దీనిని తమ ప్రతాపంగా యెంచుకోవడం కూడా వుంది. ఇంతటి అపకారమైన అభ్యాసం యింకొకటి వుండబోదు. సృష్టిలో మన నోటినిండా పండ్లెందుకు అమరినవా అనే ఆలోచనే వీరికి లేదన్నమాట.

పై పండ్లు పదహారు, క్రింది పండ్లు పదహారు మొత్తం మనకు 32 పండ్లు కలవు. ఇవి అన్నీ ఒక్కపనికోసరం మాత్రమే యేర్పడినవి కావు. చెరుకుగడ తీసికొని దానిని నమలదలచేవారు మొదట పై చెక్కను తీసివేయవలసి వుంటుంది. ఈ పనికి కొన్ని పండ్లు ఉపయోగపడును. ఆపండ్లతోనే చెక్కతీసిన గడను ముక్కలు ముక్కలుగ కొరకబోతే అది సాధ్యపడదు. ఆపనికి వేరు పండ్లుపయోగించవలెను. అట్లనే రసముపిండడానికి మరి వేరే పండ్లుపయోగించవలసివచ్చును. ఇంతపని జరిగినతర్వాత రసమును మింగడానికి వీలవుతుంది. ఎంతటి సోమరిపోతైనా యిన్నిపనులు చేయక చెరుకుగడను తినలేడు. కొందరు పై చెక్కను తీయడానికి కత్తినిగాని, కత్తిపీటనుగాని ఉపయోగింతురు. ముక్కలనుగూడ వీటితోనే తరుగుకొని తరువాత నమలడానికిమాత్రం పండ్లుపయోగింతురు. ఇదిగూడ నిజముగా సోమరితనమే. చెక్కతీయడంతో కూడ పండ్లతోనే సాధిస్తే ఆ ఆనందమువేరు; ఆరుచివేరు. అప్పుడు శ్రమకు తగిన ఫలితం కలుగుతుంది.

విధిలేని చెరుకుగడవంటి వస్తువుల సందర్భంలో తప్పితే పండ్లుపయోగించేపని నేటి నాగరకులు పెట్టుకోవడంలేదు. ఇది

గొప్పపొరపాటు. దీనివల్లనే మలబద్ధము.అజీర్ణాదిరోగములు మెండైపోయినవి. వరి అన్నముతిన్నా నమలడం అత్యవసరం.నమలడము అలవాటు కాకపోవడముచేతనే అన్నము కొంచెము నానవాయికావడముతోనే (అంటే పలుకు వుండడముతోనే) నేటి మన ప్రజలు పారవేయడము సంభవించుచున్నది. నిజముగా చక్కగా నమిలి మింగగలిగితే పలుకు యెవరికీ యేమీ అపకారంచేయదు. మెత్తగా వండిన బియ్యపు అన్నము విషయంలో దిగమ్రింగినా మహారిష్టం లేకపోవచ్చును గాని, యితరవస్తువులు (అందే వేపుడులు, దుంప కూరలు వగైరాలు)నమలకపోతే దానివల్లకలిగే అరిష్టము నిజముగా గొప్పది. చదువరు లందరూ దీనిని గమనించవలెను. వస్తువుల స్వభావమునుబట్టి అధమపక్షం యిరవై మొదలు ముప్పైనిమిషముల వరకైనా ఆహారంతింటూ కూర్చోవడం అవసరం.

ఇంతదూరం ఉపయోగపడేపండ్లను పరిశుభ్రంగా వుంచుకొనవలెనని వేరుగా చెప్పనక్కరలేదు. అందుచేతనే మన పెద్దలు ప్రతి దినమూ జరుపవలసిన కాలకృత్యములలో దంతధావనమును చేర్చినారు. ఈ పనినికూడ బహు త్రొందరగా నోట నీరువేసుకొని పుక్కిలించడంతో పూర్తిచేసే పెద్దలు యేర్పడుతున్నారు. సావధానంగా పుల్లలతో పండ్లుతోముకునే అభ్యాసంకలవారుకూడా నోటిలో గంటల కొలది పుల్లపెట్టుకోవడంతప్ప దానిని పండ్లుతోముటకు ఉపయోగించే సమయం తక్కువ. ఈవిషయంలోకూడా మనజీవితంలో జాగ్రత్త అవసరం. నేటి పండ్ల రోగాలు మితిమీరి పోతున్నవి. వీటి మూలకంగా అతిదారుణమైన పరిస్థితులు చిన్నపిల్లలలోకూడ ప్రారంభమవుతున్నవి. బళ్లలో డాక్టర్లు పండ్ల పరీక్షచేసే ఆచారం యేర్పడడానికి యిదే కారణం. ఇది ఆచారమాత్రంగా నిలచిపోవడం మన దౌర్భాగ్యం. తెలివిగల ఒక్కొక్కరూ పండ్లను గురించిన జాగ్రత తీసుకొని తీరవలెను. లేనియెడల నేటి పరిస్థితులు యింకా విషమముకాగలవు.

## ౫. అభిప్రాయ భేదము

### ( క థ )

ఆయనకు కూతురుతప్ప ఇంకెవరూ సంతానము లేరు. ఆయన వడ్డీవ్యాపారంచేసే షాహుకారువద్ద గుమాస్తా. ఆయనద్వారా షాహుకారు బదుళ్లు ఇచ్చేవాడు. ఆయనే పద్దులు వ్రాసేవాడు. అప్పులు వసూళ్ళు చేసేవాడు. ఆయనకు ముప్ఫయిరూపాయల జీతం. ఇదిగాక నూటికి రూపాయిచొప్పున తాను బదులిప్పించిన వారి దగ్గరనుంచి రుసుము వసూలుచేసేవాడు. దానాదీనా ఆయన జీవయాత్ర గడుపుతున్నాడు. ఇల్లుకొన్నాడు, తోట వేయించాడు.

ఈమధ్యనే ఆయన భార్య్ కొాక కాసులపేరూ, కూతురి కొాక కంఠె చేయించాడు. కూతురు కంటె పెట్టుకొని ఆడుకొం టూంటే తల్లిదండ్రులు చూచి సంతోషించేవారు. కూతురికి అయిదోయేడు.

### ౧

ఆప్రాంతాన యానాదిమనిషి కాపురముంది. ఆమెకు ఒక కూతురు. ఆకూతురికి మూడోయేడు. రెండుసంవత్సరముల్తైనది భర్త ఆమెను వదలిపెట్టి యెక్కడకోవెళ్ళి. అప్పటినుంచి ఆ యానాదిమనిషి దొరికినప్పుడు కూలీనాలీచేసుకొంటూ యే చెట్టు కిందో యే పంచనో నిద్రపోతూ కూతురినిపెట్టుకొని కాలక్షేపం చేస్తూ వున్నది. కూలదొరకనప్పుడూ, రెండు మూడు రోజులపాటు తిండిదొరకనప్పుడూ కూతురిని పోషించడానికి మార్గం కనబడక ఆమె వీధులవెంట ముష్టికి బయలుదేరేది.

ఆ యానాదిమనిషికి ఆకూతురే సర్వమూ. ఇరుగుపొరుగు వాళ్ళను యాచించి తెచ్చుకొన్న చిరుగుచొక్కాలతోనూ, పరికిణీ

తోనూ కూతురికి ముస్తాబుచేసేది. ముస్తాబుచేసిన కూతురిని చూచి ఆతల్లి హృదయం ఉప్పొంగేది.

నల్లని, నున్నని బూడిద అంటిన శరీరం; చిక్కుకట్టిన నల్లనిజుట్టూ; తళతళలాడి నవ్వేకళ్ళూ; అకారణముగా పెదవులు విడిపడడంచేత కలిగిననవ్వూ రోజురోజూచూచే ఆమెకు భర్తలేని లోపం కనిపించలేదు. దీనికితోడు కొంతముస్తాబు కూతురికిచేస్తే కాని ఆ తల్లికి మనశ్శాంతి లేకపోయేది.

అందుకని బయళ్ళలో వికసించిన తంగేడుపువ్వులు తీసుకు వచ్చి ఆమె కూతురికి చెవులో జూకా లుంచేది, మెళ్లో సేరులు వేసేది.

ఒకమారు పచ్చగన్నేరు పువ్వులూ, ఒకమారు తురాయి పువ్వులూ, ఒకమారు తంగేడుపువ్వులూ సంపాదించి కూతురికి ముస్తాబు చేసేది. కాని ఆమెకు ఇంకా తృప్తికలగలేదు. కారణం యేమిటంటే?

పండుగలకూ పబ్బాలకూ నాగరీకుల పిల్లలు బంగారు నగలు ధరించడం ఆమె చూచింది. అవి చాలా బాగున్నవని ఆమె అనుకుంది. తన కూతురుకూడా అలాంటినగలు పెట్టుకుంటే ఎంత బాగుంటుందో—ఎంతబాగుంటుందో! ఆ పూటకు తిండిలేని ఆ యానాదిమనిషికి బంగారునగలు ఎక్కడనుంచి వస్తవి?

3

సంవత్సరాదినాడు అందరూ ముస్తాబైనారు. అందరూ వేపపువ్వు తిన్నారు.

ఆ యానాదిమనిషికి సంవత్సరాదికి ఇతరదినములకూ తేడా ఏమీలేదు. అన్నిరోజులూ ఒక్కటే. అన్నిరోజులూ తిండికీ బట్టకూ తాపత్రయపడవలసిన రోజులే.

అప్పుడు తంగేడుపువ్వులు పూయడంలేదు. రాధామనోహరం పువ్వులూ, నందివర్ధనంపువ్వులూ కలవు. వాటితోటి ఆమె కూతురికి అలంకరించింది. కాని వెనుకటికోరిక ఇంకా సఫలం కాలేదు. తనకూతురికి బంగారునగలుంచి ముస్తాబుచేసి ముద్దుపెట్టుకుంటే - ముద్దు పెట్టుకుంటే—

ఆనాడు మధ్యాహ్నం కూతురిని చంకనుపెటుకొని వీధి వెంట నడు వెళుతున్నది యానాదిమనిషి. కూతురు తల్లితో ఏవేవో ఊసులాడుతున్నది.

ఒకచోట ఆయన - అంటే షాహుకారుదగ్గిర గుమాస్తా - కూతురు ఆడుకొంటున్నది. కంటె మెళ్ళోపెట్టుకుని ఆడుకొంటున్నది. ఆ యానాదిమనిషి ఆ పిల్లను చూచింది. తన కూతురికి ఆకంటె—అలాంటికంటె పెట్టితే—పెట్టితే ఎంత బాగుంటుందో - అలాంటి కంటె యెలాగా పెట్టడం? పోనీ ఆ కంటె పెట్టితే— అమ్మో! ఆకంటే!

ఆతల్లి ప్రాణం ఉంగబట్టిందికాదు. ఆ యానాదిమనిషి ఆ పిల్లదగ్గరికి వెళ్ళింది. పళ్ళుపెడతానని మంచిమాటలాడింది. మెళ్ళో కంటెతీసింది. తన కూతురు మెళ్ళో పెట్టింది. చూచింది. తల్లి ప్రాణం కుదుటపడింది. తన కూతురిని ముద్దుపెట్టుకొంది. కాని ఒక సందేహం కలిగింది. తంగేడుపువ్వులవల్ల కలిగే అందంకంటే

13

కంటెవల్ల యేమియెక్కువ అందం కలిగింది? ఎందుకో యీ భాగ్యవంతులు యీలాంటి నగలు పెట్టుకుంటారు?

కంటె పెళ్ళోనుంచి తీసినతర్వాత గుమాస్తాకూతురు కెవ్వున కేకవేసింది. యానాదిమనిషి భయపడింది. ఆపిల్లకేక విన్నవాళ్ళు పరుగెత్తుకు వచ్చారు. యానాదిమనిషి పరుగెత్తిందిభయపడి. వాళ్ల వెంటపడ్డారు. పట్టుకొన్నారు. చితకామతకా తన్నినారు.

కంటె తీసినట్లు ఆమె ఒప్పుకుంది. కాని కారణం చెప్పింది కాదు. ఆమెకూతురు మెళ్ళోకంటె వాళ్లు తీసుకున్నారు. కూతురు ఏడ్చింది. యానాదిమనిషి కూతురు ఏడ్పువిని జాలిపెందింది.

పొట్టగడవక ఆమె దొంగతనం చేసిందని పోలీసువాళ్ళకు ఆమెను అప్పచెప్పారు.

గుమాస్తా న్యాయముగా సంపాదించిన డబ్బుతో చేయించిన కంటె అన్యాయంగా దొంగిలించినందుకు యానాదిమనిషి కొంత కాలం చెరసాలలో కూతురుతోకూడా ఉండవలసివచ్చింది. దొంగ తనము చేసినందుకని ప్రజలన్నారు, తనకూతురికి ముస్తాబుచేసి నందుకని ఆమె అనుకొన్నది.

( 'దీక్షితులు కథలు' నుండి )

## ౬. అన్నిటికీ అలవాటే మూలం

'అనగననగ రాగ మతిశయిల్లుచుండు
తినగతినగ వేము తియ్యనుండు
సాధనమున బనులు సమకూరు ధరలోన !'

అన్నాడు వేమన. ఇందులోని సత్యం గ్రహించడం మానవుని పురోభివృద్ధికి చాల ప్రయోజనకారి.

మన జీవితంలో ఆరోగ్యమూ, సౌఖ్యమూ అనుభవించ వలెనంటే తప్పకుండా చిన్నతనంనుంచీ కొన్ని అలవాట్లు చేసుకొనవలెను. మన పెద్దలు దిన చర్యకు సంబంధించిన అలవాట్లను గట్టిగా మతంతో ముడిపెట్టి మనకు కలిగింప ప్రయత్నించినారు.

ఏ ప్రాణియైనను ఉషఃకాలమున లేవవలెనన్నారు. అంటే సాధారణంగా తెల్లవారుటకు ముందు 4 గడియలు ఉన్నదనగానే నిద్ర మేల్కొనవలె నన్నమాట. ఇది మనవారు చెప్పిన సూత్రం మాత్రమే కాదు. ఇంగ్లీషులో 'అర్లీ టు బెడ్ అండ్ అర్లీ టు రైజ్, మేక్స్ ఎ మేన్ హెల్దీ అండ్ వైజ్' అని ఒక నానుడి కలదు. పెందలకడ పరుండి పెందలకడనే నిద్రలేచిన మనిషి ఆరోగ్యవంతుడూ వివేకవంతుడూ అగునని దీని అర్థము. ఈ అలవాటుచేత కలిగే లాభాలు అన్నీ యిన్నీ కావు. వ్యవసాయ కార్యక్రమాలకేమి, ప్రశాంతంగా చదువులు వ్రాతలు సాగించుకొనడానికేమి ప్రొద్దుటి ముహూర్తం చాలా మంచిది. ఈ దినం మనదేశంలో యీ అలవాటు తప్పిపోవడంచేత మనం క్రమరీతిని జీవితాన్ని నడుపుకొనలేక పోవుచున్నాము. ఎంత త్వరగా యీ అలవాటు మనం చేసుకొని మన పిల్లలకు కలిగిస్తే అంత త్వరగా మనం ముందుకు సాగగలము.

15

నిద్రలేచి వూరికి దూరంగా కాలకృత్యములను నెరవేర్చుకొనవలసిన దన్నారు. నేటిదినం వూరి ముందర గబ్బుకొట్టే పరిస్థితులు మన పెద్దలు నిర్ణయించిన అలవాటుకు వ్యతిరేకము.

తరువాత అలవాటు దంతధావనము. ఇది యెంత అవసరమో నేటి వైద్యులు మనకు విశదముగా చెప్పగలరు. పండ్ల రోగములు అజీర్ణాది యితర రోగములను కలిగించి అపాయకరమగుచున్నవి. అపరిమితంగా తాంబూలం నమలడమూ, పొగాకు నమలడమూ, చుట్టలు బీడీలు వగైరా త్రాగడమూ పండ్లను పరిశుభ్రంగా వుంచడానికి ఆటంకము. సామాన్యస్థితిలోకూడ మంచి వేపపుల్లనో, కచ్చికనో, పండ్లపొడినో చక్కగాఉపయోగించి ప్రతి నిత్యమూ పండ్లుపరిశుభ్రం చేసుకొంటూవుంటే ఆరోగ్యానికిభంగం కలగదు. ఏతిండి తినిన తర్వాతనైనా పుక్కిలించి వుమ్మివేయడం కూడా బాగా అలవరచుకోవలెను. లేకుంటే తినిన వస్తువుల శేషాలు పండ్లలో యిరుకుకొని కుళ్ళి జాడ్యములను తెచ్చును. కనుకనే పుక్కిలించి వుమ్మివేసే అభ్యాసం మన పెద్దలు నిర్ణయించినారు.

మనపెద్దలు స్నానానికి గొప్పస్థానం యిచ్చినారు. ఎవ్వరుగాని ప్రతిదినమూ స్నానంచేయకుండా వుండరాదు. శరీరంలోని కల్మషం చాలాభాగం చర్మంలోని సన్నని రంధ్రాల మూలకంగా క్షణక్షణమూ బయలువెడలుతూ వుంటుంది. కాబట్టి ప్రతిరోజూ స్నానంచేసి యీ రంధ్రాలను కప్పిన కల్మషాన్ని కడిగివేస్తే తప్ప మన కారోగ్యం నిలవడం కష్టం. స్నానమంటే ఒంటిమీద నీరు దిగజారితే చాలును అనుకొనేవా రున్నారు.ఏనీరైనా ఉపయోగించేవారున్నారు. స్నానంచేసే నీరు పరిశుభ్రంగావుండవలెను. స్నానం చేసేటప్పుడు ఒంటిని రుద్దుకొని స్నానం చేయడం గూడ అవసరం.

ఇదేవిధంగా మన పెద్దలు భోజనాన్నిగురించీ, పరిశ్రమను గురించీ, నిద్రనుగురించీ అనేక సూత్రాలను నిర్ణయించినారు. ఇవన్నీ ప్రతిదినమూ అలవాటు చేసుకొనవలసినవి. అట్టి అలవాట్లు కలిగితే మానవుడు క్రమం తప్పకుండా జీవించగలడు.

ఆరోగ్యానికి సంబంధించిన యీ అలవాట్లనేగాక మనం యితర విధాలైన అలవాట్లనుగూడ చేసుకోవలసి యున్నది. ఇందులో మాటకు సంబంధించిన అలవాటు ముఖ్యమైనది. మన పెద్దలు మిత వాక్కునకు అగ్రస్థానం యిచ్చినారు. వదరుబోతు తనం అనేక దోషాలను చెడుగులను తెచ్చి పెడుతుంది. వేదాలలో వాక్కును పవిత్రపరచి మాట్లాడమన్నారు. వృథాగా కాలక్షేపం కొరకు నోటికి వచ్చినట్లెల్ల మాట్లాడుతూ వాదోపవాదాలు పెంచు కొనడంచేత లోకమునే పాడుచేస్తున్నాము. దీనికి ప్రతీకారంగా గాంధీవోటి పెద్దలు మౌనవ్రతాన్నికూడ అమలులో పెట్టినారు. 'ఆయన మహాత్ముడు. అన్నీ చేయగల'డని అట్టివారిని త్రోసి వేయడం లోకంలో పరిపాటి అయినది. ఇది చాల తప్పు. నిజంగా లోకంలో బాగుపడదలచినవారు యెంతవరకవసరమో అంతే మాట్లాడడం చాలా మంచిది.

మరియొక అభ్యాసం మనసునకు సంబంధించినది. మన పెద్దలు మనసును కోతికిపోల్చినారు. అతిచంచలమని వర్ణించినారు. మనుష్యులలో కొందరి చరిత్రచూస్తే చిత్రంగా కనిపిస్తుంది. ఏ నిల కడా లేనివారూ, అతిరభసంగా జీవనంచేసేవారూ, నిమిష నిమిషం తమమీద యేమి వచ్చిపడుతుందోనని తహతహపడేవారూ చాలా మంది సంఘంలో కనిపిస్తారు. దీనికి కారణం మనసును చిక్కబట్ట లేకపోవడమే. అందుచేత మనం మనోనిగ్రహం సంపాదించే అలవాటు మొదటినుండీ చేసుకోవడం మంచిది. దీనికే మన పెద్దలు

ప్రార్థన, జపము, యోగాభ్యాసము మొదలైన కార్యకలాపాలను నిర్ణయించినారు. కాని కష్టసుఖాలను సమానంగా భరించే దృష్టిని మొదటినుంచీ మనం పెంపుచేసుకోకపోతే యీజపతపాలుకూడ నిరుపయోగా లవుతాయి.

## ౭. పంచాయతీలు

మనదేశంలో పరంపరగా యేదో విధంగా పంచాయతీలు యేర్పడుతూనే వున్నవి. చాలా మోటుప్రజలలో కూడ కుల పంచాయతీలు నేటికిని యేర్పడుచున్నవి. వీటిలో కుల పెద్దలు చేరి కులం విషయంలో జరిగిన తప్పులను విచారించి తప్పుచేసిన మనిషికి జరిమానా వేసి శిక్షించడం జరుగుతూవుంది. వెనుకబడిన వర్గాలలో యిట్టి విచారణ కొంత మూఢ విశ్వాసాలకు తావిచ్చినా, ప్రజలు తమకువచ్చే వివాదాలను పరిష్కారం చేసుకోడానికి పంచాయతీలనే ఆధారంగా పెట్టుకున్నారనుటకు యిది ప్రబల నిదర్శనం.

వట్టి కులతప్పులుకాక ప్రజలలో కలిగే యితర వివాదాలను తీర్చడానికికూడ పంచాయతీలు యేర్పడడం నిన్న మొన్నటివరకూ మనదేశంలో జరిగినది. సామాన్య వివాదాలు - అంటే తిట్టుకోవడమూ, కొట్టుకోవడమూ, ఆస్తిఅప్పులకు సంబంధించిన చిన్నచిన్న తగాదాలూ వగైరా మొట్టమొదట వూరి పెద్ద దగ్గరకు విచారణకు వచ్చేవి. నోటిమాటగా అతడు తీర్మానం చెపితేనే యిరుపక్షాలవారు ఒక్కొక్కప్పుడు సమాధానపడిపోయేవారు. అది జరగనప్పుడు ఉభయులకూ విశ్వాసముండే పంచాయతీ యేర్పడేది. ఆ పంచాయతీ తీర్మానానికి వీరు కట్టుబడేవారు. ఎప్పుడైనా ఒకప్పుడు చాలా అన్యాయం జరిగిందంటే మరియొక పంచాయతీకూడ యేర్పడి తీర్పు చెప్పేది. ఇది ఒకప్పుడు భారతభూమిలో ఆచరణలోవుండిన పద్ధతి.

బ్రిటిష్ ప్రభుత్వం యేర్పడి కోర్టులు బాగా ప్రచారంలోనికి వచ్చినతర్వాత పంచాయతీలను యేర్పరచుకొని తగాదాలు తీర్మానం చేసుకునే అలవాటు సన్నగిలిపోయింది. నిజంగా నశించిందంటేనూ తప్పుగాదు.

కోర్టులవల్ల యెంతనష్టం కలుగుతూవుందో యీదినం అందరికీ బాగా తెలుసు. అయినా సత్యాన్ని అసత్యంచేయడానికీ, అసత్యాన్ని సత్యం చేయడానికీ గ్రామాలకు దూరంగావుండే యీకోర్టులలో అవకాశాలు వుండడంచేత స్వార్థపరులైన మనుష్యులు కోడిపందాలాడినట్టుగా కోర్టులకెక్కి యిల్లు గుల్లచేసుకుంటున్నారు. మన దేశంలోని దారిద్ర్యానికి యీ కోర్టులు కొంత కారణమని చెప్పవచ్చు. లంచగొండితనం ప్రబలడానికీ, అసత్యం పెరగడానికి యీ కోర్టులు ప్రధాన కారణాలంటే దోషంకాదు, కార్యపరులుకాకుండా వట్టి వాదవివాదాలతో కాలం జరిపే జాతిగా మన మేర్పడిపోయినామంటే యీ కోర్టులలో తయారైన ధోరణే హేతువనవచ్చును.

నిజంగా న్యాయవిచారణ సత్యసమ్మతం కావలసివుంటే యే దూరపువారో కూట సాక్ష్యంమీద. తప్పుడు పత్రాలమీద ఆధారపడి తీర్పులుచెప్పే అవకాశం రద్దుకావలె. దీనికి పంచాయతీల విచారణకంటే వేరే మార్గం లేదు.

దీనినే మదరాసు పంచాయతీ శాసనంలోకూడ అతిపేలవంగా గుర్తించడం కనిపిస్తుంది. ఈ శాసనం చిన్నమొత్తాల దావాలు, కొద్దిపాటి నేరాల విచారణ పంచాయతీలకు అప్పగించింది. కాని యిప్పటి పైపూతలతో నేటి రోగం నివారణకాదు. గట్టిగా ప్రజలలో ప్రబోధం చేయడం, గ్రామసీమలలో వివాదాల పరిష్కారంచాల యెక్కువ భాగం పంచాయతీలకు సంక్రమింపజేయడం అత్యవసరం.

## ౮. వనములు - మనమహోత్సవాలు

వనముల పెంపకము సప్త సంతానములలో ఒకటిగా మన పెద్దలు గణించినారు. అందుచేతనే సాధ్యమైనంతవరకు ప్రతిపల్లె టూరికి సామాన్యముగా వూరిముందర ఒక్క వనమైనా వుండేది. ఒకతరానికిముందు యిట్టి వనముల దృశ్యమును కనులపండువుగా చూచుభాగ్యము కలుగుచుండినది. కథలలో, కావ్యాలలో గ్రామసీమ లను వర్ణించినవారు వానిలోని యే పాత్రయో వనములోని చెట్లక్రింద విశ్రమించడాన్ని ఒక వర్ణనాంశంగా తీసుకోవడం గోచరిస్తున్నది.

నాగరికత పెరిగినతర్వాత వంటచెరకునిమిత్తం సజీవమైన చెట్లను నరకడం మొదలయింది. కొంచెం పట్టణవాసనలు యేర్పడ్డ పల్లెల్లో వనములు అదృశ్యమైనవి. వూరి వనములవలెనే వనములనే పేరుతో వ్యవహరించబడిన అడవుల విషయంలోనూ అపచారాలు జరిగినవి. గ్రామానికి దగ్గరగావుండే అడవులు సాధారణంగా నశించి పోయినవి. వనముల, అడవుల ప్రయోజనాన్ని నవీన శాస్త్రదృష్టితో ప్రచారంచేసేవారు యేర్పడడంతో చెట్టుచేమల పెంపకముమీద మన దృష్టి నిలవడం ఆరంభమయినది.

ప్రకృతిసిద్ధంగా దట్టమైన అడవులున్న ప్రాంతాలలోనే అత్యధికంగా వర్షం పడడం గమనింపదగిన విషయం. భూమధ్య రేఖకు అటుయిటూ బ్రహ్మాండమైన అడవులుండడం, అచ్చట వర్ష పాతంకూడ యెక్కువకావడం భూగోళశాస్త్రంలో విశదం అవుతు న్నది. ప్రపంచంలోకల్లా యెక్కువ వర్షంకురిసే 'చిరపుంజి' అస్సాం రాజ్యంలో పెద్ద అడవులమధ్యన వున్నది. వర్షం బొత్తుగాలేని 'సహారాయెడారి' చెట్టూ చేమాలేని ప్రాంతంగా యేర్పడింది. కాబట్టి మానవుడు యేమాత్రం జీవితాధారమైన పంటలను పండించుకోవలె నన్నా, చెట్టుచేమలను నశింపుచేయకుండా, క్రమంగా అభివృద్ధిపరచే

ధోరణిలోనే ప్రవర్తించవలెను. ఇదే నేటిదినపు అటవీశాస్త్రజ్ఞులు బోధించే ప్రధాన విషయం.

బ్రిటిష్‌వారు మన దేశంలో రాజ్యం చేస్తుండగా అడవుల సంరక్షణకోసరం అతి కఠినమైన అటవీశాసనాలు చేసినారు. కాని చెట్ల పెంపకానికి తగిన నిర్మాణాత్మకమయిన కృషికి వారు పూనుకో లేదు. ఒక్క మైసూరురాష్ట్రంలోమాత్రం మహారాజా పుట్టినదినం మొదలైన సందర్భాలను పురస్కరించుకొని చెట్లు నాటించే ప్రయత్నాలు జరుగుతూవుండేవి. నేడు మనకు సంపూర్ణ స్వాతంత్ర్యం లభించి ప్రజల పరిపాలన యేర్పడింది. కనుక యిప్పుడు ప్రభుత్వానికి నిర్మాణాత్మకమైన కార్యక్రమంమీద దృష్టివుండక తప్పదు.

ఇటీవల కేంద్రప్రభుత్వంలో మంత్రిగావున్న మున్షీగారు వన మహోత్సవమనే పేరుతో ఆసేతు హిమాచలమూ చెట్లను నాటించే ప్రయత్నాన్ని ఉపక్రమించినాడు. ఈప్రయత్నం యేటేటా సాగిస్తున్నారు. ఇది హర్షింపదగిన సంగతి.

ప్రభుత్వంలో వుండేవారి ప్రయత్నమాత్రంచేత యిట్టిపనులు పూర్తికావు. ప్రజల జీవితంలో యిట్టి కార్యక్రమం అనుదిన అభ్యాసంగా యేర్పడి పోవలెను. పూర్వకాలపు పెద్దలు వనప్రతిష్ఠ సప్త సంతానములలో ఒక్కటని నిర్వచించినారు. నేటిదినపు ప్రజలందరును చెట్లునాటుట జీవితావసరమని గ్రహించేటట్లు వివేకవంతులందరూ ప్రబోధం చేయవలెను.

## ౧౦. గోడ వార్తా పత్రిక

( సంభాషణ )

రామన్న

ఏమోయ్ వెంకయ్య బావా! అదేమిటి ఆ గోడవద్ద అంతమంది నిలబడి చూస్తున్నారు?

వెంకయ్య

అది గోడ వార్తాపత్రిక రామన్నా! వాళ్ళంతా అక్కడ నిలబడి దానిని చదువుకొంటున్నారు.

రామన్న

అదేమి పత్రికోయ్ బావా! ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, కృష్ణాపత్రిక, యిలాంటి పత్రికలున్నాయని విన్నాగాని యిదెక్కడా చూడలేదే! అయితే యిదెక్కడనుంచి వస్తుందంటావు?

వెంకయ్య

ఇదెక్కడనుంచో వచ్చేదికాదు. ఇది మాగ్రామములోనిదే. దీనిపేరు గ్రామజ్యోతి. మావూరి గ్రంథాలయములో పనిచేసే వెంకటేశ్వర్లు దీనిని నడుపుతున్నాడు. గ్రంథాలయానికి పత్రికలు రాగానే వాటిని పూర్తిగా చదివి అందులోని ముఖ్యవిషయాలను ఆ గోడబల్లమీద వ్రాస్తూవుంటాడు. మళ్ళా మర్నాడు కొత్త పత్రికలు వచ్చిన తరువాత యీ రోజున వ్రాసినవి చెరిపేసి కొత్తపత్రికల లోని వార్తలను మరల వ్రాస్తాడు. ఈ లోపుగా ఎంతోమంది వాటిని చదువుతూ ఉంటారు.

రామన్న

అయితే గ్రంథాలయానికి పత్రికలు వస్తున్నవిగదా! వాటినే చదువుకుంటారుగా, మళ్ళీ యిదెందుకు?

## ౯. వోటిచ్చునప్పుడే వుండాలె బుద్ధి

వోటిచ్చు నధికార మున్నట్టివారు
యెన్నికల సమయాన తిన్నగా వినుడు
మట్టిబానలు కొనిన కొట్టి చూచెదము;
సరకుకొన వీధెల్ల తిరిగి చూచెదము;
పండు పండెనో లేదొ పట్టి చూచెదము;
వరు నన్నివిధముల తరచి చూచెదము;
వోటువేయుట పిల్లలాట యెట్లగును ?

అభ్యర్థులై వోటు అడిగేటివారు
యేమేమిజేసిరో యెటువంటివారొ ?
సొరకాయ కోతలకు మురిసిపోతారా ?
కర్రకొరకని జీలకర్ర గొంటారా ?
చెరకుతీపని వంటచెరుకు నమలుదురా ?
ఉప్పుకప్పూరంబు లుండు నొకతీరు
గుణముల జూచియే గుర్తింపవలయు ;
పురుషు లెవ్వారు కాపురుషులెవ్వారు ?
గుర్తించి వోటులను గురిపింపవలయు.

ప్రాణతుల్యము ప్రజాస్వామ్యమున వోటు
వినియోగ పరచుటకు అనువైన ఘడియ
యేతెంచె నేతెంచె నిన్నాళ్లకైన
అనుచుంటి నీమాట అనుభవముకొద్ది
వోటిచ్చునప్పుడే వుండాలె బుద్ధి
యెన్నుకొని తలబాదుకొన్న నేమగును ?
తర్వాత యేడ్చినను తప్ప దనుభవము.

('నాగొడవ' నుండి)

వెంకయ్య

నిజమే వాటిని చదువుకోవచ్చు. కాని అవి అందరికీ ఒకే సారి అందుబాటులో వుండవు. అదీగాక మనం తీరుబడిచేసుకొని వెళ్ళినపుడు గ్రంథాలయంవద్ద మనిషి ఉండకపోవచ్చు. వారు ఉన్నప్పుడు మనకు వెళ్ళి చదువుకోడానికి తీరుబడి వుండకపోవచ్చు. కాని ఆగోడ పత్రికలోని వార్తలు యెప్పుడుపడితే అప్పుడు చదువుకోవచ్చు. పొలం పోతూపోతూ మనం ఒక క్షణంపాటు ఆ బల్ల వద్ద నిలబడితే వార్తలు సంగ్రహంగా అర్థమవుతాయి. అదీగాక పత్రికలు ఒకేసారి ఒకరివద్దకంటె యెక్కువమంది చదువలేరు. కాని దీనిని ఒకేసారి యెంతోమంది చదువుకోవచ్చు. ఇంకోతేడా కూడావుంది. పత్రికలలో భాష కొత్తవారికి అర్థమవటం కష్టం. కాని దీనిమీద వ్రాత నాబోటివాళ్ళకు చాలా తేలికగా అర్థమౌతుంది.

రామన్న

అయితే పత్రికలో వున్నన్ని వార్తలు యిందులో పట్టవుగా?

వెంకయ్య

నిజమే, పత్రికలోని వార్తలన్నీ మన కవసరముండవు. ముఖ్యమైన సంగతులన్నీ దీనిమీద వ్రాస్తూనే వుంటారు. అంతగా పూర్తి వివరాలు కావాలంటే మనము తీరుబడి అయినప్పుడు గ్రంథాలయానికి వెళ్ళి చదువుకోవచ్చు. లేదా మర్నాడు పాత పత్రికలు తెప్పించుకొని చూచుకోవచ్చు. అదీగాక యీ పత్రికవల్ల నాబోటి వాళ్ళకు చాలా లాభంగావున్నది. ఇదివరకు నాకుపత్రిక చదవడం నడిచేదేకాదు. చిన్నప్పుడు చదువుకోమంటే ఒకరోజువెళ్ళి ఒక రోజు వెళ్ళక తప్పించుకు తిరిగేవాణ్ణి. ఇప్పుడిప్పుడు గోడబల్లమీద సంగతులు చదువుతూవుంటే లోగడ చదివిన చదువు జ్ఞాపకమొస్తూ వుంది. విషయాలుకూడా కొద్దికొద్దిగా తెలుస్తూవున్నవి. ఇలా

మా గ్రామంలో చాలమంది యీ గోడపత్రికద్వారా నిత్యం చదవటం అలవాటు చేసుకున్నారు.

రా మ న్న

మరి ఒక్కొకనాడు పత్రికలురావుగదా. ఆరోజునేంచేయాలి?

వెం క య్య

ఆ క్రిందటిరోజున వ్రాసిన వార్తలను వుండనివ్వవచ్చు. లేదా అవి చెరిపేసి మంచికథో(చిన్నది), పాటో, పద్యమో,యేమైనా చిక్కుప్రశ్నలో యేదోవొకటి వ్రాయవచ్చు. అప్పుడప్పుడు మన గ్రామంలో జరిగే గడ్డిపాటలు, పంచాయతీబోర్డు, కో ఆపరేటివ్ బ్యాంకు, గ్రంథాలయ మీటింగులు, యితరసభలు లేక చుట్టుపట్ల గ్రామాలలో జరిగే విశేషాలు మొదలైనవి వ్రాసుకోవచ్చు.

రామన్న

అయితే వ్రాసేవాడు బాగా చదువుకొని వుండాలనుకుంటాను.

వెంకయ్య

చదువంటే పెద్దగా యం. యే. లు, బి. యే, లు చదువ నవసరంలేదు. నిత్యం పత్రికలతో పరిచయముండాలి. దేశ పరి స్థితులు తెలుసుకొంటూ వుండాల. అన్నిటికంటే మంచి ఉత్సాహం, ఓర్పూ కావాలి. దస్తూరి బాగుంటే మరీమంచిది.

రామన్న

ఓ! అయితే మావూళ్ళో హనుమంతరావనే కుఱ్ఱోడున్నాడు. అతని దస్తూరి చాలా బాగుంటుంది. నిత్యమూ పత్రిక చదువుతూ వుంటాడు. గ్రామచావడి దగ్గర ఒక బల్ల కట్టించి వ్రాయిస్తాం. మరి దీనికి యేమాత్రం ఖర్చవుతుందంటావు?

వెంకయ్య

సాధారణంగా 2 గజముల పొడవు 1 గజం వెడల్పు వుండే గోడస్థలానికి అర్ధమూట సిమెంటుకంటె యెక్కువ పట్టదు. ఇప్పటి ధరలనుబట్టి మొత్తం ఖర్చు సుమారు 4-0-0 ల కంటె యెక్కువ కాదు. ఇంకా పెద్దది కావాలంటే యింకా కొంచెం యెక్కువవుతుంది. ఆ బల్లమీద వ్రాయటానికి సీమసున్నపు ముక్కలకు నెలకు పావులా పడుతుందేమో। అంతే.

రామన్న

చాలా వీలుగావుందే. తప్పకుండా యేర్పాటు చేస్తాను మా వూళ్లో. ఇంక వెళ్దామా ?

వెంకయ్య

ఊం.........పద.........

( 'గ్రంథాలయ సర్వస్వము' నుండి )

౧౧. వర్షం యెట్లు వస్తుంది ?

మనం సుఖంగా జీవించాలంటే పంటలు బాగా పండాలి. పంటలు బాగా పండాలంటే వర్షాలు బాగా కురవాలి. అందుచేత వర్షం యెలావస్తుందో తెలుసుకోవడం అవసరం.

వర్షాలకీ, మేఘాలకీ సంబంధం వున్నట్లు మన కందరికీ తెలుసు. మేఘాలు యెక్కువగాను, నల్లగాను వున్నప్పుడు వర్షం వస్తుందనీ, మేఘాలు తక్కువగాను, తెల్లగాను వున్నప్పుడు వర్షం రాదనీ మనం అనుభవంలో చూస్తున్న విషయం.

మేఘాలలో యెవరో దేవతలు కూర్చొని నీళ్లుదిమ్మరిస్తారని పూర్వకాలంలో అనుకునేవారు. అటువంటి నమ్మకాలు యీరోజున కూడా అక్కడక్కడ వుండబట్టే వర్షాలకొరకు వరుణ దేవుని కొంత మంది ప్రార్థిస్తారు. కాని అది మూఢ నమ్మకం. అసలు వర్షం యెట్లు వస్తుందో శాస్త్రజ్ఞులు యిప్పుడు తెలుసుకున్నారు.

మేఘాలుఅంటే నీటిఆవిరి తప్ప ఇంకేమీ లేదు. ఒక బల్ల మీద కొంచెం నీరు పడితే, అది కొంత సేపటికి యెండిపోయి, ఆవిరిగా గాలిలో కలిసిపోతుంది. అలాగే సముద్రం, చెరువులు, నదులలోనుంచి నీరు నెమ్మది నెమ్మదిగా యెల్లప్పుడూ ఆవిరిఅయి గాలిలోకి పోతుంది. వేడిచేస్తే నీరు త్వరగా ఆవిరి అవుతుంది. కనక, చలికాలంలోకంటె వేసవికాలంలోనే యిట్లు ఆవిరి అవడం హెచ్చు. మజ్జిగకంటె వెన్న తేలిక అయినట్లు, గాలికంటె నీటి ఆవిరి తేలిక. అందుచేత యీ ఆవిరి పైకి యెగిరి మేఘాలుగా అవుతుంది.

భూమిమీదనుండి పైకి వెళుతున్నకొద్దీ చల్లదనం హెచ్చుతుంది. అందుకనే క్రింద గదులలోకంటె మేడమీద చల్లగా వుంటుంది. అంతేకాదు. యెండాకాలం పోగానే గాలి చల్లబడి పోతుంది. అందుచేత పైకిపోయే మబ్బులు యెండాకాలం పోగానే చల్లబడతాయి. ఆవిరి చల్లబడగానే నీరు అవుతుందికదా ! మబ్బులలోని ఆవిరి నీరుగా మారుతున్నకొద్దీ మబ్బులరంగు నల్లగా అవుతుంది. అంతకంతకు చల్లబడి మబ్బులలోని ఆవిరి నీరుగా మారిపోయి వర్షపు చినుకులుగా క్రిందికి పడుతుంది. ఇదే వర్షం.

వర్షం కురవడానికి చల్లదనమే చాలదనీ, కొంత ధూళిఅణువులుకూడా అవసరమనీ యిటీవల శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. ఆవిరి చల్లబడ్డకొద్దీ బరువెక్కి పొగమంచుగా భూమిదగ్గరకు వచ్చేస్తుంది.

శీతాకాలంలో యిది మనకు అనుభవమే. గాలిలో కొంత ధూళి కూడా వుంటే ధూళిరేణువులచుట్టూ ఆవిరిచేరి చల్లబడి వర్షపు బిందువుగా తయారవుతుంది. భూమిమీద దట్టంగా యేర్పడిన పొగమంచులో ఒకరకపు ధూళినిజల్లి, దానిని నీటిబిందువులుగా మార్చి, వర్షం కురిపించి, పొగమంచును తీసివేయ గలుగుతున్నారు. ఈ విధంగా వర్షం యెట్లు వస్తుందో తెలియడంచేత కావలసినప్పుడు గాలిలోని ఆవిరిని కూడదీసి వాన కురిపించుకోవచ్చు.

సముద్రము, నదులు, చెరువులలోనుంచి ఆవిరి తయారవడమేకాక, భూమిలోనుంచి చెట్లు పీల్చుకొను నీటిని ఆకులలోనుంచి ఆవిరిగా వదులుతున్నాయి. ఈ ఆవిరికూడా మేఘా లవుతుంది. అందుచేతనే అడవులున్నచోట వర్షాలు హెచ్చు. అడవులు కొట్టివేస్తే వర్షాలు తగ్గిపోతాయి.

సముద్రపునీరు ఉప్పగా వుంటుంది. కాని నీరు ఆవిరి అయినప్పుడు ఉప్పు సముద్రములో వుండిపోతుంది. అందుచేత వర్షపునీరు తియ్యగా వుంటుంది. ఉప్పునీటిని తియ్యగా చెయ్యడానికి వర్షం తోడ్పడుతుంది. కాని వర్షపునీరు నదులుగా ప్రవహించి మళ్ళా సముద్రములోనికిపోయి ఉప్పునీటిలో కలసిపోతున్నది. ఈ లోపుగానే ఆనకట్టలుకట్టి, కాలువలు తవ్వకుంటే నదుల నీటిని పంటలకు ఉపయోగించుకోవచ్చును. మంచి పంటలు పండించుకొని అందరూ సుఖంగా జీవించవచ్చును.

## ౧౨. దేవాలయం : గ్రంథాలయం

మన పూర్వులు దేవుడి పూజకోసం వూరూర ఒక గుడి కట్టించి నారు. ఈ గుడిలో యేటేటా కళ్యాణోత్సవం, పండుగరోజుల్లో వేరే ఉత్సవాలు యేర్పాటుచేసినారు. ఈ ఉత్సవాలలో వూరి ప్రజ లంతా పాల్గొని సంతోషంగా కాలం గడపడం మామూలు.

ఉత్సవ దినాలలో ప్రజలు కులాసాగా కాలం గడపడానికి మాత్రమే మన దేవాలయాలు ఉపయోగపడలేదు. బాటసారులకు సత్రాలుగా, గ్రామాలలోని పిల్లలకు చదువుల బడులుగా, యౌవను లకు పెండ్లి మందిరాలుగా, పెద్దలకు తీర్పుచెప్పే న్యాయస్థానాలుగా యివి ఉండినవి. గ్రామశిల్పము, సంగీతము, నాట్యములకు నిలయాలుగా యివి చాలాకాలం పనిచేసినవి. తత్త్వబోధలు, పురాణ హరికథా కాలక్షేపాలు, కవి పండితగోష్ఠులు దేవాలయాలలో తరుచు జరుగుతూ వుండేవి.

దేవాలయ పూజారి విద్యావంతుడై పురోహితుడుగా, వైద్యు డుగా, గురువుగా గ్రామవాసులకు సేవ చేసేవాడు. ప్రజల సామా న్యమైన అక్కరలను తీర్చేవాడు. ఈవిధంగా మన దేవాలయం సాంఘిక కేంద్రంగా ప్రసిద్ధిపొందింది.

కాలం గడచినకొద్దీ మన ఆచారాలలో అనేక మార్పులు వచ్చినవి. వీటివలన మన దేవాలయాలు యింతవరకూ చేస్తూ వచ్చిన కార్యక్రమాలు నిలచిపోయినవి. ఈ కార్యక్రమాలు ఒక్కొ క్కటిగా ఇతరసంస్థలకు సంక్రమించినవి. ఇందులో ముఖ్యంగా విద్యకు, విజ్ఞానానికి సంబంధించిన విధులు గ్రంథాలయాల పరమై నవి. గ్రంథాలయానికి 'చదువులగుడి' అని పేరు వచ్చినది. యువ కవి ఒకాయన దీనినే 'గ్రంథాలయం నేటి దేవాలయం' అనేపాటలో చక్కగా పొదిగినాడు. ఈ పాట 'గ్రంథాలయ గీతాలు' అనే పుస్త

కంలో వున్నది. దీనిని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు ప్రచురించినారు.

గ్రంథాలయాలద్వారా చదువులు కొంత నేర్చినవారు వీనిని మరచిపోకుండా వుండవచ్చు. లోకంలో జరుగుతూవున్న అనేక విషయాలను యెవరికివారు స్వయంగా తెలుసుకోవచ్చు. గ్రంథాలయంలోని పుస్తకాలూ, పత్రికలూ ఏమీ తోచనప్పుడు కాలక్షేపానికీ, మనస్సు వికలంగా వున్నప్పుడు కుదుటపరచడానికీ, సందేహాలు నివృత్తి చేసుకొనడానికి, వృత్తులు వ్యాపారాలలో అభివృద్ధిని సాధించడానికీ ఉపయోగపడతాయి. ఇందులో సుఖజీవనానికి సూచనలను తెలిపేవికొన్ని; మంచి చెడుగులను నిర్ణయించడానికి వివేచనను యిచ్చేవికొన్ని; సంఘంపట్ల వ్యక్తుల ధర్మాన్ని బోధించేవి కొన్ని; ఆత్మశాంతికి కావలసిన ఆలోచనలు చెప్పేవి కొన్ని; ఇట్లు రకరకాలుగా వుంటాయి.

ప్రజలలో విజ్ఞానవ్యాప్తికొరకు నేటి గ్రంథాలయాలు యెన్నో రీతుల కృషిచేస్తున్నవి. ఇవి ప్రజలకు చదువులపట్ల రుచిని కల్పిస్తూ వారు గ్రంథాలయాలలోని పుస్తకాలను హెచ్చుగా చదివేటట్లు చేస్తున్నవి.

గ్రంథాలయ సేవకుడు దేవాలయం పూజారికంటె ఎక్కువ ఆసక్తితో ప్రజాసేవను చేస్తాడు. ప్రజల రుచులకు తగిన పుస్తకాలను, పత్రికలను సంపాదించి వారి కందిస్తాడు. స్త్రీలూ పురుషలూ పిల్లలూ పెద్దలూ గ్రంథాలయాన్ని బాగా ఉపయోగించుకొనడానికి ఉపాయాలను వెదకుతాడు. వాటిని అమలు పరుస్తాడు. తన చాకచక్యంద్వారా గ్రంథాలయానికి చదువరులను యెక్కువగా ఆకర్షిస్తాడు. సులభమైన పుస్తకాలతో ప్రారంభించి, వారు ఉత్తమ గ్రంథాలవైపు మరలునట్లు కృషి చేస్తాడు. ప్రజాసామాన్యంలో

హెచ్చుగా మసలుతూ వుంటాడు. వారి కోర్కెలను, అవసరాలను తెలుసుకొని వాటిని తీర్చడానికి తంటాలు పడతాడు. పుస్తకాలలో మూలమూలలా దాగివున్న చిత్ర విచిత్రమైన విషయాలను కనిపెడతాడు. వాటిని పాఠకుల కందజేస్తాడు.

నేటి గ్రంథాలయం స్థానిక ప్రజల సాంఘిక కేంద్రంగానూ, విశ్వవిజ్ఞాన కేంద్రంగానూకూడ పనిచేస్తూవుంది. కోరినవారికి పుస్తకాల నిస్తూ సందేహాలను తీర్చడమేగాక, అప్పుడప్పుడు సమావేశాలు, గోష్ఠులు, ప్రదర్శనాలు జరుపుతుంది. వీటిద్వారా ప్రజలలో విజ్ఞానం పట్ల ఆసక్తిని పెంచుతూ, సాంఘిక కేంద్రంగా తనకార్యక్రమాన్ని సాగిస్తూవుంది. విశ్వవిజ్ఞాన కేంద్రంగా గ్రంథాలయం తన విధిని యెట్లు నెరవేరుస్తుందో దిగువ కథ మనకు తెలుపుతుంది.

కెనడాదేశంలో 'మనిటోబా' అనే యూనివర్సిటీవుంది. దీని గ్రంథాలయ పాఠకులలో ఒకాయన 'తాళవిలాసం' అనే పుస్తకం కావలెనని కోరినాడు. దీనికొరకు వారు తమ గ్రంథాలయాన్ని గాలించినారు. జాడదొరకలేదు. వెంటనేవారికొక ఆలోచనతట్టింది. దీనికొరకు వారు మదరాసు యూనివర్సిటీ లైబ్రరీకి వ్రాసినారు. ఈలైబ్రరీవారు దీని దర్యాప్తుకై యెన్నో శ్రమలు పడినారు. కొంతకాలమైన పిమ్మట ఒకనాడు తాటిచెట్టు వర్గానికిచెందిన ఒక పుస్తకంలో దీని ప్రశంస కనబడింది. దీనినిబట్టి మరొకపత్రికను వెదుకగా 'తాళవిలాసం' వివరాలు కొన్ని తెలియవచ్చినవి. దీని కర్త కుంభకోణంనివాసి. ఆయన దీనిని తమిళంలో పద్యకావ్యంగా వ్రాసినట్లు, దీనిలో తాటిచెట్టు ప్రయోజనాలు 801 వర్ణింపబడినట్లు ఆచూకీ చిక్కింది. కాని పుస్తకంమాత్రం దొరకలేదు.

ఇంతలో ఒకనాడు మదరాసు యూనివర్సిటీ లైబ్రరీకి ఒక పుస్తకం వచ్చింది. ఇది బ్రిటిష్ ఇండియా, సింహాళములలోని తాటిచెట్టుజాతికి సంబంధించిన వృక్షములను గురించిన ఇంగ్లీషు

గ్రంథము. దీనిలో ఒకమూల వారెంతో ఆతురతతో వెదకుతూ వున్న 'తాళవిలాసం' ప్రస్తావనవుంది. ఈ పుస్తకం గ్రంథకర్త తాను చాల పర్శియాసపడి తాళవిలాసం ప్రతిని కనుగొన్నట్లు వ్రాసినాడు. దాని తర్జుమాను పూర్తిగా తన పుస్తకంలో చేర్చినాడు. దీనిని చూడడంతో మదరాసు యూనివర్సిటీ లైబ్రరీవారి కెంతో సంబరమయింది. వెంటనే వీరు 'తాళవిలాసం' వివరాలు మనిటోబా యూనివర్సిటీ గ్రంథాలయంవారికి వ్రాసి పంపినారు.

ప్రపంచంలో మారుమూలనున్న విజ్ఞానాన్నికూడ అడిగిన వారికి అందజేయడం గ్రంథాలయం విధి. ఈ సంగతిని పై సంఘటన మనకు చక్కగా బోధిస్తున్నది.

## ౧౩. సహకారవిధానం

ప్రపంచమంతటా నేటిదినం ప్రజలు పరస్పర సహకారంతో జీవనం చేయవలెనని పెద్దలంతా సందేశాలిస్తున్నారు. దీనికి కారణం స్పష్టంగానే కనిపిస్తూవుంది. లోకంలో ఒక్కొక్కరూ స్వార్థపరులైపోయి ఒకరినిమించి ఒకరు, ఒకరిని మోసగించి ఒకరు పోటీలుపడి విత్తమార్జించడమే జీవిత లక్ష్యంగా పనిచేస్తున్నారు. ఇది పోరాటాలకూ, యుద్ధాలకూ దారితీసి మానవసమాజాన్నే కలవరపరచినది. సర్వనాశనస్థితిని తెచ్చి పెట్టినది.

ఇట్టి ఫలితాన్ని యెదుర్కొనడానికి ప్రజలలో ఒక క్రొత్త దృష్టి యేర్పడవలసి వున్నది. మానవుడు పుట్టినప్పుడే తల్లి పోషణ అవసర మవుతుంది. అదేవిధంగా పెద్దవాడై జీవనం గడిపేటప్పుడు సంఘం తనను పోషించవలెనని కోరుకుంటాడు. సంఘ

మంటే తనబోటి వ్యక్తుల కూడికయని అతడు గ్రహించలేక యిత రులను తానుకూడ షోషించవలెనను సంగతిని మరచిపోయినాడు. అందుచేతనే దుష్ట పరిణామాలు కలిగినవి. ఇట్లు మరచిపోయిన మనిషికి తన నిజస్వరూపాన్ని తెలియపరచడానికే 'సహకార విధానం' అనే ఒక గొప్ప ఉద్యమం ఆర్థికంగా బయలుదేరినది. పెట్టుబడిదారు తనమేలే చూచుకొన్నందువలన అతనిదగ్గర పని చేసే సామాన్యులు కడగండ్లు పడవలసి వచ్చినది. దానికి ప్రతీ కారం ఆలోచించడములో తమలోతాము ఒకరినొకరు ప్రేమతో సమానంగా చూచుకొంటూ ఒకరినొకరు సాకుకొనేపద్ధతి అవలం బిస్తే పెట్టుబడిదారు దౌర్జన్యాన్ని అరికట్టవచ్చుననే భావం వారి యందు పుట్టినది. అదే నేటి సహకారోద్యమానికి బీజం. దానికి ఫలంగానే డెన్మార్కు బోటి దేశాలలో ప్రజల జీవితం యావత్తూ సహకార విధానంమీద ఆధారపడి ఆదేశపు జీవనదృష్టి పూర్తిగా సహకారదృష్టియైనది.

మన దేశంలోనూ ఆర్థికమైన సహకారోద్యమం చాలా కాలంగా అమలులోవున్నది. కాని యిక్కడ నిరంకుశులైన బ్రిటిష్ ప్రభువులు దీనిని ప్రవేశపెట్టి నడపడంలో యిది వారి ననుసరించు కొని వుండిన ద్రవ్యవంతుల చేతులలో పడిపోయి ఉద్యమానికే అపకీర్తికలిగే సందర్భము లేర్పడినవి. నిజానికి సహకార జీవి తంలో మనుష్యునికీ మనుష్యునికీ సమత్వం వుండవలెను. మన దేశంలో 100కి 90 మంది చదువురానివారు కావడంచేత ఆ విష యంలో సమత్వం కొరవడి అనేకమైన మోసాలు,దురాచారాలు తల యెత్తినవి.

నేడు మనము స్వతంత్రుల మైనాము. మనకు అనేక విధ ముల సమత్వం క్రమక్రమంగా కలుగుచున్నది. గాంధీయుగంలో



80



ఆయన అస్పృశ్యతా నివారణ వగైరా ఉద్యమాలుపెట్టి సాంఘిక సమత్వాన్ని సాధించడానికినీ, ఖద్దరు,చేతిపరిశ్రమలు ప్రోత్సహించి ఆర్థిక సమత్వాన్ని సాధించడానికినీ పాటుపడినాడు. మనము ప్రజలను చక్కని చదువరులను, విజ్ఞానవంతులను చేస్తూ ఆర్థికంగా సహకారవిధానాన్ని విరివిగా వ్యాపింపజేసినయెడల మనదేశంలోనూ డెన్మార్కుకంటె యెక్కువగా సహకార జీవితపు దృష్టిని స్థిరపరచడానికి వీలవుతుంది. 'అందరికి నే నవుదు, నా కందరగుదురు' అనే సహకార సూత్రాన్ని అమలులో పెట్టినయెడల జాతీయ జీవితాన్ని ధన్యంచేయడానికి మార్గం యేర్పడుతుంది.

## ౧౮. దేశభక్తి

దేశమును ప్రేమించుమన్నా,
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయీ.

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్
తిండి కలిగితె కండగలదోయ్
కండగలవాడేను మనిషోయ్!

యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్?
జల్దుకుని కళలెల్ల నేర్చుక
దేశసరుకులు నించవోయీ.

దేశాభిమానం నాకు కద్దని
వట్టిగొప్పలు చెప్పుకోకోయ్;
పూని యేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయీ!

ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయీ

ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయీ!

సొంతలాభం కొంతమానుక
పొరుగువాడికి తోడుపడవోయ్

దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయీ!

('గ్రంథాలయ గీతాలు' నుండి)



# నిరక్షరాస్యత నిర్మూలింపుడు

## శ్రీ చివుకుల శేషశాస్త్రి

నిరక్షరాస్యత నిర్మూలింపుడు
విద్యావ్యాప్తిని చేయండోయ్ ॥నిర॥

గుడులే బడులు గోడలె పలకల్
పాటలె పాఠాల్ మాటలె చదువు
వార్తాపత్రిక కాలక్షేపం ॥నిర॥

చెట్టుచేమల చేరిచదివిరి
పుట్టుపూర్వోత్తరాలనుండి
తాతలు తండ్రులు వ్రాత చదువులను ॥నిర॥

విద్యనేర్చి విశ్వంబేలండీ
స్వాతంత్ర్యంబును చక్కదిద్దుకొన
మేటిసాధనము చదువని యెరిగి ॥నిర॥

('గ్రంథాలయ గీతాలు' నుండి)

## — జాతీయ గీతము —

జనగణమన అధినాయక జయహే భారతభాగ్యవిధాతా
జయహే-జయహే-జయహే-జయ జయ జయ జయహే ॥
పంజాబ సింధు గుజరాత మరాఠా ద్రవిడాంధ్రోత్కల వంగా
వింధ్య హిమాచల యమునా గంగా ఉచ్ఛల జలధి తరంగా
తవ శుభనామే జాగే తవశుభ ఆశిషమాగే
గాహే తవజయగాథా
జనగణ మంగళదాయక జయహే భారతభాగ్యవిధాతా
జయహే-జయహే-జయహే- జయ జయ జయ జయహే ॥

# శ్రీ వీరేశలింగ గ్రంథావళి

వీరేశలింగం రచనలలో ముఖ్యమైన వానిని ప్రముఖు లెన్నిక చేయగా వారి శతవార్షిక జన్మదినోత్సవ ప్రచురణలుగా ప్రకటించినవి.

పెండ్లిండ్లలో, పోటీలలో బహుమతులుగా యిచ్చుట కను కూలమైనవి.

ప్రతి యింటిలోను, గ్రంథాలయములోను ఉండతగినవి,

| | |
|---|---|
| మొదటిసంపుటము : నాటకములు | 6-0-0 |
| రెండవ సంపుటము : చిత్రరచనలు | 4-0-0 |
| మూడవ సంపుటము : ఉపన్యాసములు | 4-0-0 |

# గ్రంథాలయ సూక్తులు

సంకలనము : పాతూరి నాగభూషణం

ఇరువదియైదు ఉత్తమ గ్రంథములు, పత్రికలనుండి దిగువ శీర్షికల క్రింద ఏరి కూర్చిన ప్రబోధకరములగు సూక్తులిందుగలవు.

విద్య - గ్రంథములు - వార్తాపత్రికలు - గ్రంథపఠనము - గ్రంథాలయములు - గ్రంథభాండాగారి - గ్రంథవరణము - ప్రచారము - వివిధశాఖలు - వయోజన విద్య - గ్రంథాలయోద్యమము.

విద్యార్థులకు, గ్రంథాలయ కార్యకర్తలకు, విద్యాభిమానులకు, సాహిత్యప్రియులకు ఇది చాల ఆలోచనల నందించి సంతోషపెట్టుటకు సమర్థమైనది.

వెల ఒక రూపాయి

: ప్రతులకు :

గ్రంథాలయ పుస్తకశాల

పటమట పోస్టు, కృష్ణాజిల్లా



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B112 |
| పుస్తకం పేరు | వయోజన విద్య 01 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NOI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Apsar |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |